రావు, సి. ఆర్.

భౌతికవాదము

ఇందుపల్లి, 1940

Record no. 66

Bibliographic Record Target

రావు, సి. ఆర్.

భౌతికవాదము / గ్రంథకర్త సి. ఆర్. రావు. - 1. ముద్రణము. - ఇందుపల్లి పోస్టు, కృష్ణా జిల్లా : జాలాది పార్థసారథి, 1940.

106 p. ;18 cm.

Record no. 66

Rāvu, Si. Ār.

Bhautikavādamu / granthakarta Si. Ār. Rāvu. - 1. mudraṇamu. - Iṃdupalli pōsṭu, Kṛṣṇā jillā : Jālādi Pārthasārathi, 1940.

106 p. ;18 cm.

Record no. 66

# భౌతికవాదము

గ్రంథకర్త:


## సి. ఆర్. రావు





ప్రకటనకర్త

**జాలాది పార్థసారథి**

ఇందుపల్లి పోష్టు, కృష్ణాజిల్లా







1940

4 అణాలు

ప్రథమ ముద్రణము
వేయి ప్రతులు







శ్రీ శారదా ముద్రాక్షరశాల
బెజవాడ

అధ్యాయము 1

# భౌతికతత్వశాస్త్రము

**(Phylosophical Materialism)**



విజ్ఞానం అభివృద్ధిచెందేకొలదీ ప్రజల్లో మూఢనమ్మకాలు పోతూఉన్నవి. పురాతనకాలంలో ఉరుము, మెరుపు, వర్షము, సూర్యుడు, చంద్రుడు మొదలగు ఘటనలకారణాలు తెలియనప్పుడు, వీనిని మానవులకన్న గొప్పవనీ, సౌఖ్యము నిచ్చేవనీ పూజించేవారు. కాని రానురాను శాస్త్రం అభివృద్ధి చెందినందున వీనికారణాలు ప్రజలకు తెలిసినతరువాత పూజించుట మానివేశారు. ప్రకృతి అర్థంజేసుకోబడి మానవసౌఖ్యంకోసం వినియోగించుకోబడుచున్నది. మోటార్లు, రైళ్లు, విమానాలు, విద్యుచ్ఛక్తి మొదలగునవెన్నియో కనిపెట్టబడి మానవసౌఖ్యానికి తోడ్పడినవి. కాని ప్రపంచములోని అన్నివస్తువులు మానవుల ఆధీనములోకి రాలేదు. వాని పుట్టుపూర్వోత్తరాలు ఇంకా పూర్తిగా తెలియలేదు. జీవంలేని వస్తువులకు జీవంపోసే శక్తి ఇంకా మానవులకు రాలేదు. జీవితావసరాలకు కావలసిన వస్తువులు ఎన్ని ఉత్పత్తిఅగుచున్నా నిరుద్యోగము, ఆకలిబాధ వీనివలన ఉదయించే సర్వరోగములు మానవులను పీడించుచున్నవి. కష్టపడనివారికి సర్వసౌఖ్యాలు; కష్టపడేవారికి అన్నీ కష్టాలే. వీనికారణం ప్రజాసామాన్యానికి పూర్తిగా వెల్లడి కాలేదు. అందువలన మానవాతీతమైన శక్తి ఒకటి యున్నదనీ,

ఆశక్తియే దేవుడనీ అభిప్రాయము ఇంకా వ్యాపించియున్నది. నిరుద్యోగము, ఆకలిబాధ మొదలగునవి నిర్మూలింపబడి, కష్ట పడువారికి సర్వసౌఖ్యాలు చేకూరే సోవియటు రష్యాలో, మానవాతీతమైనశక్తిమీద నమ్మకం నానాటికి సన్నగిలుతోంది. అలాగే ప్రపంచమంతటా సోవియటు రష్యాలోవలె సోషలిస్టు సమాజం స్థాపింపబడినప్పుడు మానవులకు తమశక్తిలో తమకు నమ్మకం గలిగి, మానవాతీతమైనశక్తి ఉన్నదనేనమ్మకం పూర్తిగా పోతుంది.

### భావవాదము - భౌతికవాదము
### ( Idealism and Materialism )

మానవునిలో పరస్పరము వేరు అయిన ఆత్మ, శరీరము అను రెండుభాగము లున్నవి. అందులో ఆత్మ నిత్యమైనదనీ, నాశనము లేనిదనీ, పంచజ్ఞానేంద్రియములచే (కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము) తెలుసుకోబడనిదనీ, గుర్రాన్ని రౌతు నడిపినట్లుగా ఆత్మ శరీరాన్ని నడుపుతుందనీ చెప్పే వాదమును 'భావవాద'మందురు. భావము, ఆత్మ వేరువేరుపదార్థాలైనప్పటికీ రెండూ ఒకటే. శరీరానికి మూలం భావ మనువాదం గనుక 'భావవాదము' అందురు.

శరీరము, ఆత్మ ఒకదానితో నొకటి వేరుగాదు. పదార్థము పరిణామము చెందుతూ, మానవరూపం జెందినపదార్థము యొక్క ప్రత్యేకగుణము. శరీరము నశించినవెంటనే దానియొక్క గుణమైన ఈ ఆత్మగూడ నశించుతుందని చెప్పేవాదమును 'భౌతికవాద'మందురు. భౌతిక మనగా పంచజ్ఞానేంద్రియాలచే



తెలుసుకోబడే పదార్థమునకు సంబంధించినది. పదార్థమే ఆత్మకు మూలమనువాదము గనుక 'భౌతికవాద' మనబడుచున్నది. గోడలు, వాసాలు, తలుపులు, దర్వాజాలు ఒకపద్ధతిలో అమర్చినందువలన ఇల్లు అను ఆకార మేర్పడినది. ఇల్లు ఊడదీయగానే ఇంటి ఆకార మెట్లా లేదో, అలాగే శరీరము నశించగానే ఆత్మ లేదు. అయితే ఇల్లు కట్టేవా రొకరుండాలిగదా? అలాగే మానవుని సృష్టించినవా రొకరుండవలెనుగదా? అను ప్రశ్న రావచ్చును. గోడలు, వాసాలు మొదలగునవి ఇల్లుగా పరిణామము పొందలేదు. కాని అనేకకోట్ల సంవత్సరాలుగా పదార్థము పరిణామము చెంది, ప్రాణమున్న పదార్థముగానికి మారి, అటు తర్వాత మానవశరీరంగా పరిణామం చెందిన దని శాస్త్రము ఋజువుచేయుచున్నది. దీనినే 'పరిణామవాద' మందురు. దీనిని గూర్చి తరువాత వివరింపబడును.

భావవాదము :—ప్రపంచములోని అన్ని వస్తువుల సృష్టికి మూలం ఒకశక్తి యున్నది. దానినే హిందూమతములో 'బ్రహ్మ' లేక 'పరమాత్మ' యనీ, క్రిష్టియను మతములో 'గాడ్' అనీ, మహమ్మదీయమతములో 'అల్లా' అని వేరువేరు పదములతో పిలువబడుచున్నది. ఆశక్తియే ప్రపంచములోని జీవరాసులన్నిటిలో నిండియున్నదనీ, చావు బ్రతుకు లన్నిటికీ కారణమనీ అన్ని మతములూ ఒప్పుకొంటాయి. ఆశక్తి పంచజ్ఞానేంద్రియాలతో తెలుసుకోబడుటకు వీలులేదనీ, జ్ఞానేంద్రియములను బంధించి అనగా బయటప్రపంచములో ఏమి జరుగుచున్నదీ గ్రహించక కామము, మోహము మొదలగు అరిషడ్వర్గముల పారద్రోలి,

సుఖాన్ని త్యజించి, మనస్సును నిలిపి, ఆశక్తియందు నమ్మక
ముంచి ధ్యానంచేస్తే, ఆధ్యానముద్వారా ఆశక్తిని పొందగలుగు
దుమని చెప్పబడుచున్నది. ఇదే మోక్షము పొందుట యనబడు
చున్నది.

హిందూవేదాంతములో ముఖ్యమైన భేదాలు మూడు.
శంకరాచార్యుని అద్వైతము; రామానుజాచార్యుని విశిష్టా
ద్వైతము; మధ్వాచార్యుని ద్వైతము. శంకరాచార్యుని అద్వై
తముప్రకారం ఆత్మ పరమాత్మ అయిపోవచ్చు. అనగా ఆత్మ
పరమాత్మలో లీనమైపోవచ్చు. రామానుజాచార్యుని విశిష్టా
ద్వైత సిద్ధాంతముప్రకారము ఆత్మ పరమాత్మలకు భేదము
లేదు గాని ఆత్మ, పరమాత్మసాన్నిధ్యాన్ని చేరుతుందిగాని
లీనమైపోలేదు. మధ్వాచార్యుని ద్వైతంప్రకారం ఆత్మ పరమా
త్మలు వేరు. ఆత్మ పరమాత్మకన్న ఎల్లప్పుడూ తక్కువయే.
ఈమూటిలో స్వల్పభేద మున్నా మూలసూత్రములోమాత్రం
భేదం లేదు. ప్రపంచానికి మూలమైన జ్ఞానేంద్రియముల కతీత
మైన పరమాత్మ యున్నది. పరమాత్మను పొందిన జీవికి మరల
పుట్టుక (పునర్జన్మ) లేదు.

భౌతికవాదము:— ప్రపంచములోనున్న వస్తువులన్నిటికీ
మూలము పదార్థమేననీ, ఏపదార్థమును పరిశీలించినా 'ఎలెక్ట్రాను,
ప్రోటాను' అను చిన్నిచిన్ని రెండు పరస్పరవిరుద్ధములైన అణువు
లతో కూడుకొనియున్నదనీ, ఒకొక పదార్థములో వేరు వేరు
సంఖ్యలలో వేరువేరు విధములుగా కూడుటవలన వివిధపదార్థము
లేర్పడినవనీ భౌతికవాదులు చెప్పుదురు. ఒక పదార్థములోనుండి



మరొక పదార్థముగా మారునేగాని పదార్థమునకు నాశనములేదనీ,
శూన్యమునుండి పదార్థము పుట్టదనీ, గారడీవల్ల పదార్థమును
చేయలేమనీ చెప్పుదురు. ఉదాహరణకు నీరు కాస్తే మనకు కను
బడకుండా ఆవిరియైపోతుంది. నీరు ఆవిరిరూపంలో ఉంటుంది.
అలాగే లాంతరులోని నూనె కాలి పొగగా మారి గాలిలో కలిసి
పోవుచున్నదేగాని, పదార్థ మెక్కడికీ పోలేదు. ఈ ప్రపంచానికి
మూలం ఏశక్తియు గాదనీ, పదార్థము పరిణామము జెందుచూ
వివిధరూపాలను జెందినదని భౌతికవాదులు చెప్పుదురు. మనకు
విషయములను తెలుసుకొనుటకు ఐదు జ్ఞానేంద్రియాలు ఉన్న
వనీ, కన్నువలన స్వరూపము, రంగు తెలుసుకొన గలుగుదు
మనీ, చెవివలన ధ్వనిని వినగలుగుదుమనీ, ముక్కుతో వాసన,
నాలుకతో రుచి, చర్మముతో గట్టిదనాన్ని మెత్తదనాన్ని
తెలుసుకొనగలుగుదుమనీ చెప్పుదురు. మనస్సు ఈ గ్రహించిన
వస్తువుల గుణములను క్రోడీకరించి వరుసలో పెట్టగలదనీ,
గ్రహించిన వానిని జ్ఞాపక ముంచుకొనగలదనీ చెప్పుదురు.
మెదడుకు కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మములనుండి
వస్తువుల గుణముల ముద్దరలు (Impressions) నరముల
ద్వారా చేరును. ప్రతి జ్ఞానేంద్రియానికి మెదడులో ఒక ప్రత్యేక
స్థానముతో సంబంధ ముండును. ఆ స్థానమునకు దెబ్బ తగిలితే
ఆ స్థానమునకు సంబంధించిన జ్ఞానేంద్రియము పనిచేయదు.

అంతేగాని జ్ఞానేంద్రియాలను కట్టిపెట్టి మెదడు ఏమియూ
తెలుసుకొనజాలదని శారీరశాస్త్రము రుజువు చేసింది. గ్రుడ్డివాడు
జీవితాంతం తపస్సుజేసి, వస్తువుల స్వరూపాన్నిగాని, రంగును

గాని మెదడుతో తెలుసుకొనగలడా? అలాగే మిగతాజ్ఞానేంద్రియాలు లేనివాడు వస్తువుల గుణాలను తెలుసుకొనగలడా? అన్ని జ్ఞానేంద్రియాలను కట్టివేస్తే మెదడుతో పరమాత్మను తెలుసుకొనేదెట్లు? ఇదివరకు తెలుసుకొన్నదానినే మెదడు జ్ఞాపకంజేసుకోగలదు. వానిఆధారంమీదనే ఊహించగలుగుతుంది. ఊహాలు ప్రపంచములోని పదార్థముమీద ఆధారపడినవేగాని మాటంతట అవి పుట్టవు. ఒకచో కూర్చొని గులాబిపువ్వుయొక్క వాసనను ఊహించగలుగుచున్నాము. రంగును, ఆకారమును ఊహించగలుగుచున్నాము. ఎందుచేత? ఇదివరకే గులాబిపువ్వువాసనను, రంగును, ఆకారాన్ని చూచాము. మెదడులో వానిప్రభావం పడియున్నది. దానిని జ్ఞాపకం జేసుకొంటున్నామన్నమాట. అంతే! అలాగే పరమాత్మను భౌతికవస్తువులమీద ఆధారపడిన వెలుగు, ఆనందము మొదలగువానిలాగున భావవాదులు వివిధ రీతుల ఊహించుచున్నారు. అందువలన వారి పరమాత్మ ఊహాదే.

అయితే నిద్రపోతున్నప్పుడు ఏమి ఆలోచించుచున్నాము? కలలు ఎలా వస్తున్నవి? అని అడుగవచ్చు. నీటిలో ఒకగడ్డవేసినట్లైతే చలనం గలుగుతుంది. అలలు ప్రారంభ మవుతాయి. ఆ అలలు చాలసేపటివరకూ ఉంటాయి. అలాగే మెదడు ఏదన్నా విషయమును గ్రహించినప్పుడు కదలుతుంది. ఆ కదలిక మెదడులో ఉంటుంది. నిద్రలో మెదడు ఆ కదలికలను మరల తీసుకువస్తుంది. ఒకకదలికమీద మరొక కదలిక కలిసిపోవుట వలన కలలో అసంభవమైన విషయములు వస్తవి. బెజవాడలో,



బందరులోఉన్న రాబర్ట్సన్‌స్క్వేరు కనిపిస్తుంది. అనగా బందరును చూచినదృశ్యము, బెజవాడను చూచినదృశ్యము కలసిపోయిందన్నమాట. ఒక్కొకసారి ఒకవస్తువును చూడకపోయినా కలలోవస్తుంది. అది ఎలాగు? ఆవస్తువునుగూర్చి విన్నప్పుడుగాని, చదివినప్పుడుగాని, దానియొక్క స్వరూపమును మనము ఎరిగియున్నవస్తువులనుబట్టి మెదడులో చిత్రించుకొంటాము. అదియే కలలో వస్తుంది. లండనును చూడకపోయినా, దానిమీద విన్నదానిమీదగాని, చదివినదానిమీదగాని కలలో రావచ్చు.

దేనినైనా భౌతికవాదులు శాస్త్రదృష్టి (Reason) ద్వారా తెలుసుకొనిగాని నమ్మరు. భావవాదులో పరమాత్మయొకటి ఉన్నదని నమ్మినగాని, దానిని పొందలేరట. శాస్త్రదృష్టి లేనప్పుడు నమ్మకం బయలుదేరుతుంది. అనగా శాస్త్రదృష్టి వెలుగువంటిది. నమ్మకం గుడ్డిది, అంధకారము. అనగా పరమాత్మ అంధకారం, గ్రుడ్డినమ్మకం. ఇంతవరకూ మానవుడు దిగంబరుడుగా అడవులలో పండ్లుఫలాలు తినినదగ్గరనుండి, యంత్రాలు మొదలగువానిని కనిపెట్టే చాలవరకూ ప్రకృతిని అర్థంజేసుకొన్నాడంటే శాస్త్రదృష్టివలనగాని మూఢనమ్మకంవలన గాదు.

### కారణము - ఫలితము
### ( Cause and Effect )

ప్రపంచములోని ప్రతివస్తువుకూ, ప్రతిఘటనకూ కారణమున్నది. కారణ మున్నవెంటనే దానిఫలిత మున్నది. పగలు, రాత్రి ఎందుకు కలుగుచున్నవి? భూమి తనచుట్టూ తాను, సూర్యునిచుట్టూ తిరుగుటవలన. పెద్దచెట్టుక్రింద చిన్నమొక్కలు

ఎందుకు పెరగవు? పెద్దచెట్టుక్రిందఉన్న చిన్నమొక్కలకు సూర్య రశ్మి తగలదుగనుక. మొక్క పెరగకపోవటానికి కారణం సూర్య రశ్మి తగలకపోవుట. చేతిలోనిరాయిని వదిలిపెడితే క్రిందపడ టానికి కారణ మేమి? భూమికి ఆకర్షణశక్తి యుండుటచేత. ప్రజలు కలిసి గ్రామాలు, పట్టణాలలో నివసించడానికి కారణ మేమి? ప్రజలు ఒండొరుల సహాయముతోనే జీవించగలరు. కార్మికులు పెట్టుబడిదారు ఎందుకు వచ్చారు? ఫ్యాక్టరీలు కట్ట బడుటవలననే. జర్మనీకి ఇంగ్లండుకు ఎందుకు యుద్ధం జరుగు చున్నది? ప్రపంచపెత్తనం కోసమే. గాంధీగారు కాంగ్రెసు నాయ కత్వంనుండి ఎందుకు తొలగింపబడినారు? భారతపెట్టుబడిదారు వర్గానికి, అహింసా విధానాన్ని అవలంబించి నోరు మూసుకు కూర్చుంటే, బ్రిటిషుప్రభుత్వంతో రాజీపడటానికి వీలుండదు గనుక. ఇంకా అనేక ఉదాహరణము లీయవచ్చు. కారణములేని ఘటనగాని, వస్తువుగాని లేదని పైఉదాహరణలు చాటు చున్నవి. అంతేగాని వస్తువులకూ, ఘటనకూ కారణం భావ వాదులు చెప్పునట్లుగా పరమాత్మ గాదు.

## మానవుడు - బాహ్యపరిస్థితులు
## (Man and Environment)

మానవునికి బాహ్యపరిస్థితు లనగా చెట్లు, ఇండ్లు, ఫ్యాక్టరీలు, పట్టణాలు, నదులు, కొండలు మొదలగునవి. మానవునికి బాహ్యపరిస్థితులతో అవినాభావసంబంధ మున్నది. మానవుని బాహ్యపరిస్థితులనుండి వేరుగా ఊహించలేము. బాహ్యపరిస్థితుల ననుసరించియే మానవుడు మారుచున్నాడు. అయితే మానవుడు



బాహ్యపరిస్థితులకు దాసుడా? కాదు. బాహ్యపరిస్థితులను గూడ మానవుడు కొంతవరకు మార్చుచున్నాడు. మొదట బాహ్య పరిస్థితులవలన మానవులలో భావము లుత్పన్న మవుతవి. (భావములే బాహ్యపరిస్థితికి మూలము కాగూడదా? అను అనుమానం ఉదయించవచ్చు. అట్లుగాదు. ఎందువల్ల ననగా మానవుడు పుట్టకముందునుండీ బాహ్యపరిస్థితి యున్నది. పదార్థ పరిణామములో మానవుడు చివర వచ్చినవాడు. ఈ విషయం ముందు వివరించబడుతుంది.) ఆ భావములు తిరిగి బాహ్యపరిస్థితిని మార్చుతవి. ఆ మారిన బాహ్యపరిస్థితి మరల మానవునిలో క్రొత్తభావాలను కల్గించుతుంది. ఈ విధముగా బాహ్యపరిస్థితి, మానవుడు ఒక దానిమీద మరొకదాని ప్రభావం పడుతూ, మానవసమాజము అభివృద్ధిజెంది ఈదశకు వచ్చింది; ఇంకనూ అభివృద్ధి జెందుచున్నది.

పై జెప్పినదానికి ఒక ఉదాహరణ—మొట్టమొదట కొమ్మకొమ్మ రాచుకొని నిప్పు బయలుదేరి అరణ్యములు తగులబడుట ఆదిమనివాసుడు చూచెను. దానిని నీళ్లు కాయుట అన్నము వండుట కుపయోగించెను. ఆ తరువాత కొన్నివేల సంవత్సరాలకు బిండెలోనినీరు చలచల కాగి ఆవిరియై వత్తిడి ఎక్కువై పై బరువైనమూతను పైకి తన్ని పారవేయుటను చూచి, ఆవిరిలోనిశక్తిని గ్రహించెను. ఆ అనుభవం ఆవిరి యంత్రం చేయుట కుపయోగింపబడినది. ఇప్పుడు మన ముపయో గించే రైళ్ళు, ఫ్యాక్టరీలు ఆవిరివలన నడుపబడుచున్నవి.

భావవాదులకూ భౌతికవాదులకూ పైన జెప్పినదానిలో భేద మేమి? భావవాదులు బాహ్యపరిస్థితికి కారణం ఊహలే

గాని, ఊహాలకు బాహ్యపరిస్థితి కారణం గాదంటారు. భౌతిక వాదులు పైన జెప్పినట్లుగా ఊహాలు బాహ్యపరిస్థితులవలన కల్గిన వంటారు. అందువలన మానవుని చేష్టలను గ్రహించాలంటే ముందు అతని బాహ్యపరిస్థితినిగూర్చి ఆలోచించుతారు.

ప్రకృతిలో ప్రతిదానికి ప్రతిఒకదానితో సంబంధమున్నది. దేనినైనా గురించి తెలుసుకోవాలంటే, ఇతరవానితో దానికున్న సంబంధములను దృష్టిలో నుంచుకొనియే తెలుసుకొనగలము. ఉదహారణ తీసుకొందాం. వృక్షములను మేకలు, ఆవులు తింటూఉన్నవి. మరల వానిపేడ చెట్లకు ఎరువగుచున్నది. ఆ జంతువులనుండి మానవులు పాలు, మాంసము తిని జీవించుచున్నారు. వృక్షములనుండి పండ్లు ఫలాలు, ధాన్యము మొదలగునవి సంపాదించి జీవించుచున్నారు. నీరు చెట్లు పెరుగుట కుపయోగపడుచున్నది. మరల ఆ చెట్లే మేఘముల నాపి వర్షము కురియుటకు కారణ మగుచున్నవి. మనుష్యులు ప్రాణవాయువును పీల్చి వదలిన బొగ్గుపులుసుగాలిని చెట్లు తీసుకొని, బొగ్గుపులుసుగాలినుండి బొగ్గును గ్రహించి ప్రాణవాయువును వేరుచేయుచున్నవి. ఈ విధముగా గాలి మరల పరిశుభ్రపడుచున్నది. చెట్లు లేకపోతే కొద్దికాలములోనే గాలిలోని ప్రాణవాయువు బొగ్గుపులుసుగాలిగా మారిపోతుంది. అప్పుడు మానవులు ప్రాణవాయువు లేక చనిపోవుట తటస్థిస్తుంది. చెట్లు కూడ మానవులు లేకపోతే బొగ్గుపులుసుగాలి లేకపోవుటవలన బొగ్గు అనుపదార్థము లేక జీవించలేవు. అందువలన మానవులు చెట్లమీద, చెట్లు మానవులమీద ఆధారపడియున్నారు. ఈ విధంగా ఇంకా అనేకఉదాహరణలు చూపవచ్చు.

---

అధ్యాయము 2

# పరిణామవాదము

శాస్త్రము (Science) అనగా రుజువులమీద ఆధారపడియున్న మానవవిజ్ఞానము ఇంత అభివృద్ధి చెందకపూర్వము మనము నివసించుచున్న భూమి, జీవరాసులు, సూర్యచంద్రులు, నక్షత్రాలు మొదలయినజగత్తు అంతా ఒక్కసారిగా దేవునిచే సృష్టింపబడిన దను మూఢనమ్మకము వ్యాపించియుండేది. ఈ మూఢనమ్మకాన్నే వివిధరూపాల వివిధమతాలు ప్రచారము చేసెడివి. మొదట ఈశ్వరుడు సూర్యచంద్రులు భూమి నక్షత్రాలను సృష్టించాడనీ, అటుతరువాత సముద్రాలన్నూ, నీటిని సృష్టించాడనీ, నీటి ఆధారముతో బ్రతికే చెట్లను, చిన్నచిన్న జంతువులను, తరువాత చెట్లను తిని జీవించేజంతువులను, తరువాత శాఖాహారులైన జంతువులమీద జీవించడానికి మాంసాహారులైన జంతువులను, ఆఖరుకు జీవకోటిలోనికెల్లా ఉత్తమముగు మానవులను సృష్టించాడనీ హిందూమతము చెప్పుతుంది. ప్రపంచములో దుష్టులప్రాబల్యం ఎక్కువ అయినపుడు అప్పుడప్పుడూ అవతారమెత్తుచూ దుష్టులను శిక్షించి ప్రపంచాన్ని రక్షించుతాడని వివిధ కాలాల్లో మత్స్య (చేప), కూర్మ (తాబేలు), వరాహా (పంది), నారసింహ (సగముమనిషి సగముసింహాము), వామన (పొట్టివాడు), రామ, పరశురామ, బుద్ధావతారములు ఎత్తి ప్రపంచాన్ని దుష్టులనుండి రక్షించాడనీ, యింకా ఇప్పుడు జరుగుచున్న కలియుగాన్ని రక్షించడానికి కలికావతారము ఎత్తనున్నాడనీ

హిందూమతము బోధించుచున్నది. ఇలాగే కొద్దీ గొప్ప మార్పులతో క్రిష్టియను, మహమ్మదీయ మతములుగూడా జగత్తుయొక్క సృష్టిని గూర్చి చెప్పును. కాని శాస్త్రము అభివృద్ధిఅయ్యేకొలదీ అనగా శాస్త్రము, భూశాస్త్రము, వృక్ష జంతుశాస్త్రములు, రసాయనశాస్త్రము మొదలగు వివిధ భాగాలుగా చీల్చబడి అభివృద్ధి అయినకొలదీ దేవునిచే జగత్తు అంతా సృష్టింపబడినదను మూఢనమ్మకం పోయినది. అనేక కోట్లసంవత్సరములక్రితం సూర్యునిలోనుండి, భూమి, చంద్రుడు, నక్షత్రాలు చీలినవని, భూమి నెమ్మదినెమ్మదిగా కొన్నికోట్లసంవత్సరములకు చల్లబడి జీవరాసులు నివసించుటకు వీలుకలిగినదనీ భూశాస్త్రజ్ఞులు ఒప్పుకొనుచున్నారు. చిన్నచిన్న జంతువులు మొక్కలు, చేపలు, కప్పలు, పాములు, బల్లులు, పక్షులు, గేదెలు, ఆవులు మొదలగు పశువులు, కోతులు, మనుష్యులు ఒకరాశి తదుపరి ఒకరు భూమిమీద పుట్టినవనీ, వృక్షజంతు శాస్త్రజ్ఞులు కనిపెట్టినారు. తరువాత డార్విను మహాశయుడు చిన్నజీవరాసులలోనుండి పెద్దజీవరాసులవరకు వరుసగా ఒక దానిలోనుండి మరియొకటి శీతోష్ణపరిస్థితులవలన పరిణామము జెందినవని ఋజువుచేసినాడు. భూమి సూర్యునినుండి వేరై మార్పుజెందుచూ యిపుడు మనము చూచుచున్న దశకు వచ్చినదను వాదమునే 'పరిణామవాద' మందురు. జీవకోటికిని వాసయోగ్యముగా అగువరకూ భూమియొక్క పరిణామము ఒకభాగమగును. అప్పటినుండి జీవరాసులతోపాటు భూమియొక్క పరిణామముకూడా వేరువేరుగా వివరించబడును.



## భూమి - సూర్యమండలము

మనము నివసించుచున్న భూమి పైన కొంచెము వత్తబడిన గుండ్రని బంతివలె నుండును. దానియొక్క డయామీటరు అనగా ఒకవైపునుండి మరియొక వైపునకు భూమి కేంద్రముగుండా పోవు గీతయొక్కపొడవు షుమారు 8000 మైళ్లు. భూమియొక్క చుట్టుకొలత షుమారు 50,300 మైళ్లు. భూమి తనచుట్టు తాను తిరుగుచు నుండుచు కనుక పగలు, రాత్రి లగుచున్నవి. భూమి తన చుట్టు తాను తిరుగుటకు పట్టు కాలము ఒకదినము లేక 24 గంటలు అందురు. భూమి తన చుట్టు తాను తిరుగుటయేగాక కొంచెము కోల ఆకారముగల దారిలో సూర్యునిచుట్టూ తిరుగుకాలమును ఒకసంవత్సర మనుచున్నాము. భూమి సూర్యునికి దగ్గరగా నున్నపుడు 915 లక్షల మైళ్లు, దూరముగా నున్నపుడు 945 లక్షల మైళ్ళు ఉండును. సూర్యుడు కొంతకాలము దగ్గరగా, కొంతకాలము దూరముగా నుండుటవలననే ఋతువులు గలుగుచున్నవి. భూమిచుట్టు దానికన్న చిన్నదియగు చంద్రుడు 239000 మైళ్ళ దూరములో తిరుగుచున్నాడు. భూమి, చంద్రుడే కాక మనకు కనబడు అనేకనక్షత్రాలు సూర్యునిచుట్టు తిరుగుచున్నవి. ఈ నక్షత్రములలో కొన్ని భూమికన్న పెద్దవిగూడ నున్నవి. మెర్క్యూరీ, వీనస్ అను రెండు పెద్దనక్షత్రములు, సూర్యునికి 360 లక్షల మైళ్ళలోను 670 లక్షలమైళ్ళలోను సూర్యునిచుట్టూ తిరుగుచున్నవి. ఈ మండలానికి సూర్యుడు కేంద్రం. సూర్యునిచుట్టూ మిగతా అన్ని నక్షత్రములు భూమి, చంద్రుడు తిరుగుచున్నవి. అందు

వలన ఈ మండలమును సూర్యమండల మందురు. సూర్యుడు గాని, భూమిగాని, యితర నక్షత్రములుగాని దేనిమీద మోపబడిలేవు. గాలిలో ఉన్నవి. ఒకదానిమీద మరియొకదానియొక్క ఆకర్షణశక్తిమూలమున సూర్యమండల మీవిధముగ నున్నది.

**భూమిపుట్టుక — జీవరాసులకు నివాసయోగ్య మగువరకూ భూపరిణామము**

సూర్యమండలములోని నక్షత్రములు, భూమి, సూర్యుడు, చంద్రుడు అన్నీ ఒకే ఎర్రగామండుచున్న సుడిగా తిరుగుచున్న వాయుపదార్థమనీ రానురాను ఈవాయుపదార్థము ఘనీభవించుచుగా భూమి, చంద్రుడు, నక్షత్రములు వేరు అనీ, అవి సూర్యుని చుట్టూ తిరుగుచున్నవనీ శాస్త్రజ్ఞులు ఊహించుచున్నారు. ఈఊహాకు ఆధారము ఉన్నప్పటికినీ దూరదర్శినితో ఆకాశములోనికి చూచిన మండుచున్న వాయుపదార్థము అక్కడక్కడా సుడిగా తిరుగుచున్నట్లు కనబడుచున్నదట. భూమి సూర్యునినుండి ఈవిధముగా 200 కోట్ల సంవత్సరాలకు పూర్వము మండుచున్న వాయురూపములో వేరయినదని శాస్త్రజ్ఞులు అంచనావేయుచున్నారు. మొదట ఈభూమి సూర్యునకు దగ్గరగా ఉండేదనీ అటుతరువాత నెమ్మదినెమ్మదిగా దూరమైనదనీ గూడ చెప్పుచున్నారు. నెమ్మదినెమ్మదిగా మండుచున్న వాయుపదార్థము ద్రవమైనదని చెప్పుచున్నారు. అప్పుడుగూడ భూమిమీద నీరుగాని జీవరాసులుగాని ఉండుటకు వీలులేదు. అంతవేడిమిలో నీరు ఆవిరిగాఉండగలదే గాని ద్రవరూపముగా ఉండలేదు. అంత వేడిమిలో జీవరాసులు జీవించియుండజాలవు. అయిన తర్వాత భూమి నెమ్మదినెమ్మదిగా చల్లబడింది. వాయురూపములో ఉన్న



నీరు ద్రవించి (ఆవిరి) వర్షరూపముగా భూమిమీదపడినది. అందువలన ద్రవపదార్థముగా ఉన్న భూమిమీద పైభాగము అక్కడక్కడా గట్టిపడి అడుగుకుపోయి అడుగున ఉన్న ద్రవపదార్థము పైకి వచ్చుట- ఈవిధముగా భూమి చాలాకాలమునకు ఘనీభవించియుండవలెను. మొట్టమొదట కురిసినవర్షము అంతా ఆవిరి అయిపోతూ ఉండియుండవలెను. భూమి వేడిమి పోగొట్టుకొనేకొలదీ కురిసిన వర్షమంతా మరల ఆవిరి అయిపోలేదు. ఈవిధముగా సముద్రములు, నదులు ఏర్పడి యుండియుండవలెను. అటుతరువాత చాలాకాలానికి భూమి జీవరాసులకు నివాసయోగ్యమై యుండవలెను.

**జీవరాసులు భూమిమీదకు వచ్చినప్పటినుంచి భూమిపరిణామము**

వర్షాలవలనకరిగిన నీటితోకలసి కొట్టుకొనిపోయి సముద్రములలో పేరుకొనిపోవుచుండెడిది. ఇలా ప్రతిసంవత్సరము ఒకొకపొర ఏర్పడి మట్టితోపాటు ఆకాలములో నివసించే జంతువులు వృక్షములు కొట్టుకొనిపోవు వానిమిగిలిపోయిన అవయవములు, వానిగీతలు ఆపొరలో ఉండియుండెడివి. నెమ్మదినెమ్మదిగా ఆపొర గట్టిపడి కొండలుగా అయిపోవుచునుండెడివి. కొన్నికొండలు భూమిఅడుగుకు పోవడం, మరి మరికొన్ని క్రొత్తకొండలు పైకి రావడమువలన పొరలు ఒకదానిమీద ఒకటి వరుసగా లేవు. గజిబిజిగా కలసియున్నవి. అయినను చాలమంది భూశాస్త్రజ్ఞులు వివిధపొరలను నాలుగు ముఖ్యభాగములుగా భాగించిరి. 1. ఎజోయిక్ కొండలభాగము (జీవరాసుల చిహ్నములు లేనిదశ) 2. పాలె ఎజోయిక్ కొండలభాగము (నత్తలు, పీతలు,

చేపలు, కప్పలవరకూ జంతువులబొమికెలు మొదలగునవి ఉన్న భాగము) 3. మెసోజోయిక్ కొండలు (పాములు, బల్లులు వాని బొమికల భాగము) 4. కెయిరోజోయిక్ కొండలభాగము (ఎలుకలు, పిల్లులు, ఆవులు, గేదెలు, కోతులు, మానవుల బొమికెలు ఉన్న భాగము). సాధారణమైన చిన్నచిన్న జంతువుల తరువాత భూమిమీద పెద్దపెద్దజంతువులు పుట్టినవని, కొండల యొక్క వివిధపొరల పరిశీలన తెలుపుచున్నది. ఈ పెద్దపెద్ద జంతువులు వాటంతటవే ఒక్కసారిగా ప్రపంచకములో ఎక్కడ నుండియో క్రింద పడవు. అప్పుడు ప్రపంచములో ఉన్న వానినుండే పరిణామము చెందియుండవలెను. శూన్యములోనుండి పదార్థము రాదు. చిన్నచిన్న జంతువులలో నుండి ఉన్నతమైన జంతువులు క్రమముగా పరిణామము చెందినవని చెప్పుటకు పై జెప్పిన వివిధపొరలపరిశీలన ఒక ఆధారము.

అంతేగాక జీవరాసులలో ఒక జీవరాశికి మరొకజీవరాశికి శరీరనిర్మాణములోను, బొమికలలోను పోలికయున్నది. కప్ప యొక్కపిల్ల మొదట చేపఆకారము గలిగి నీటిలో ఉండును. చేపవలెనే ఊపిరితిత్తులుండవు. చేపవలెనే గాలిని గిల్సు (Gills) అను వానిద్వారా పీల్చును. అటుతరువాత కొంతకాలమునకు తోక, గిల్సు పోయి ఊపిరితిత్తులు వచ్చును. మరియొక్క ఉదాహరణ తీసుకొందము. కుక్కకు ఐదు వ్రేళ్ళుండును. ఎద్దుకు రెండు పెద్దగిట్టలు, రెండు పిల్లగిట్టలు ఉండును. గుఱ్ఱములకు ఒకటే గిట్ట యుండును. కాని గుఱ్ఱముకాలిబొమికలు ఎద్దుకాలు బొమికెలు పరిశీలించిన ఐదు వ్రేళ్ల బొమికలు వేరువేరుగ కనబడును. కాని నెమ్మదినెమ్మదిగా ప్రపంచకములో అది జీవించుటకు చేయుప్రయత్నమునకు చాలకాలమునకు నెమ్మదిగా కాలిఒకవ్రేలు కనబడకుండా లోపలికి ఎగలాగుకొనిపోయినది. మిగతా రెండు వ్రేళ్ళు ఉపయోగములేక పిల్లగిట్టలుగా మారిపోయినవి. గుఱ్ఱమునకు నాలుగువ్రేళ్లు లోపలికి లాగుకొనిపోయి మధ్య పెద్దవ్రేలు గిట్టగా మారిపోయి అతిచులకనగా పరుగెత్తుటకు ఉపయోగించుచున్నది. మరొక ఉదాహరణ తీసికొందము. ఎద్దుచెవులను ఎటుఅవసరమయిన అటు కదుపును. మనుష్యులు చెవులు కదుపలేరు. కాని ఎద్దువలె కదుపుటకు అవసరమైన కండరములు మనుష్యులకుకూడ కలవు. కాని మనుష్యుడు ఆ కండరములను ఉపయోగించనికారణమున అవి క్షీణించి పోయినవి. కనుక మనుష్యుడు ఇపుడు చెవులను కదుపజాలడు. మరొక ఉదాహరణ తీసుకొందాము. కోతికి తోక యున్నది. మనుష్యునకు తోకలేదు. కాని మనుష్యునకు గూడ వెన్నెముక చివర చిన్నచిన్న బొమికలవరుస యున్నది. దాని ఉపయోగము మనుష్యున కేమియు లేదు. దీనినిబట్టి మనుష్యునకు కోతికి ఏదో దగ్గరసంబంధ మున్నయటుల ఋజువగుచున్నది. ఇంకా యిటువంటి ఉదాహరణ లెన్నో చూపవచ్చును.



ఒకదానిలోనుండి మరొక జంతురాశి పరిణామముపొందకపోతే ఒకజంతురాశికి మరొకజంతురాశికి శరీరనిర్మాణములో ఇటువంటి సంబంధములు ఎందు కుండవలెను? ఇది రెండవఋజువు.

ఇపుడు ప్రపంచములోని జీవరాసులకెల్లా చిన్నజంతువగు 'ఎమీబా' (Amoeba) ఒక్క కణము గలిగిన జంతువు.

మానవులవరకూ మిగతా జంతువులన్నీ యిటువంటి చిన్నచిన్న కణముల సమూహాములే. అతి చిన్నజంతువునకూ యింత ఉన్నతమైన మానవునకూ యీసంబంధము ఎందుకు ఉండవలెను? అంతే గాదు. మానవుని శిశువుతోసహా ప్రతి జంతువుయొక్క శిశువుయొక్క మొదటిదశ అనగా గర్భములో మొదట పిండ ముత్పత్తి యగునపుడు ఎమీబా (Amoeba) వలె ఒక కణమే. క్రమముగా యీ కణము వృద్ధియై మరల కణముగా చీలుతుంది. ఈ విధముగా ఎమీబా (Amoeba) దశలోనుండి వివిధ జంతువుల శిశువులు అభివృద్ధిజెంది వివిధ జంతువులుగా తయారగును. ఎమీబా (Amoeba) గూడ యితరజంతువుల మొదటి కణము పెరిగి చీలి పిండములు పెరిగినట్లుగనే పెరిగి రెండు కణములుగా చీలి రెండు ఎమీబాలు (Amoebas) అగును.

అనగా ప్రతిజంతువు తన జీవిత కాలములో ఆచిన్నదయిన ఎమీబా దశనుండి తన జీవితరాశివరకు మధ్యనున్న జీవితరాసుల దశ లనుభవించును. మొదటిదశలో చేప, కప్ప, కోడి, ఎద్దు, కోతి, మనుష్యుని పిండములకు భేదము కనబడదు. అవి యన్నియు, ఒకేరకముగా కనబడును. వాటన్నిటికీ చేపలకుండు గిల్సు ఉండును. ఇవి గాలి పీల్చుట కుపయోగించును. చేపపిల్లలకు గాక మిగతా జంతువులకు ఇవి క్రిమముగా పోయి వూపిరితిత్తు లేర్పడును. క్రిమముగా భేదములు ఉత్పన్నమై వివిధములుగా అభివృద్ధిచెందును. వివిధజంతువుల పిండములకు యీ పోలిక లెందు కుండవలెను? ఇవిగూడ పరిణామవిధానాన్ని బలపరచుచున్నవి. పరిణామవిధానమునకు యిది మూడవఋజువు.



## జీవరాసుల పరిణామము

(1) ఎజోయిక్ కొండలభాగము:—భూమిమీద మొట్టమొదట ఆరంభమైన కొండభాగ మిదే. ఈభాగములో జీవరాసులయొక్క ఏవిధమైన ముద్రగాని చిహ్నములుగాని కనపడవు. అందువలననే దీనికి ఎజోయిక్ కొండలభాగ మందురు. కొండలయొక్క మొత్తము వయస్సు మొట్టమొదట పుట్టుక 160 కోట్ల సంవత్సరాలు అని అంచనా వేయబడినది. ఉత్తరఅమెరికాలో ఉన్న ఎజోయిక్ కొండల మందమునుబట్టి భూశాస్త్రజ్ఞులు మొత్తము కొండలకాలములో యీకొండల భాగము 80 కోట్ల సంవత్సరములలోను అసలు జీవరాసులు లేవని చెప్పుటకు వీలులేదు. గట్టిపై కప్పులేని ఎముకలులేని జీవరాసులు పాకము లాగున ఆ లోతులేని సముద్రములో ఉండియుండవలెను. గట్టి కప్పులు లేకపోతే వానియొక్క ముద్రలు ఆకొండలలో పడుటకు వీలులేదు. అందుచే ఆ కొండలలోని జీవగాసులముద్ర లేవీ కాన్పింపవు. కాని ఆ కొండలలో అక్కడక్కడా గ్రాపయిల్ అనే బొగ్గు కొద్దికొద్దిగా కాన్పించును. దానినిబట్టి జీవములేని బొగ్గుతో గూడినపదార్థములనుండి బొగ్గును వేరుచేసి దానిద్వారా జీవశక్తిని సంపాదించి జీవించే జీవరాశి యుండియుండ వలెను. ఇప్పుడు గూడ జీవములేని పదార్థమునుంచి జీవశక్తిని గ్రహించి జీవించే జంతువులు కలవు. వీనిని బాక్టీరియా యందురు.

ఈ బాక్టీరియా యిప్పుడు గాలిలోనుండి నైట్రజిన్ అను ఒక వాయుపదార్థాన్ని తీసుకొని కొన్ని లోహాలను కలిపి కొన్నిపదార్థముల శక్తిని గ్రహించి జీవించుచూ ఆ పదార్థము

లను కొన్నిరకముల చెట్లవేళ్లకు గుబ్బలు గుబ్బలుగా పెట్టుట ప్రస్తుత వృక్షశాస్త్రజ్ఞులు ఋజువుచేశారు. ఈ బాక్టీరియాను పోలిన జీవరాసులు అప్పటి మట్టి మొదలగువానినుండి జీవశక్తిని గ్రహించి జీవించిన జీవరాసులై యుండవలెను. అటు తరువాత జీవరాసులమీద జీవించే ఎమీబా (Amoeba) ను పోలిన జీవరాసులు వచ్చియుండవలెను. ఎమీబాకు ఒక ఆకారము లేదు. పామువలెనుండు చిన్నజంతువు. ఇది తన యిష్టమువచ్చినట్లుగా ఆకారాన్ని మార్చగలదు. ఇది ఒకే కణముగా ఉన్న జంతువు. ఇది మురికినీటిలో నివసించును. ఒక మురికినీటిచుక్కను మైక్రోస్కోపు (చిన్నవస్తువులను పెద్దదిచేసి చూపును) తో పరిశీలించి చూడగలము. ఈ ఒకేకణముగా ఉన్న జంతువులు నెమ్మదినెమ్మదిగా ముఠాలుగాఉండుట, కొంతకాలమునకు ఆ కణముల గుంపులు ఎక్కువకణములుగల జంతువులుగా మారియుండవలెను. అట్టి కణములగుంపు లున్నవని యిప్పటి జంతుశాస్త్రజ్ఞులు ఋజువుచేశారు. చాల తక్కువ కణములుగల హైడ్రా అనే జంతువు ఉన్నది. అటు తరువాత యిటువంటి మెత్తని శరీరముగల జంతువులు వచ్చియుండవలెను. ఈ కాలములో ఆ కాలములోని జంతువులను పోలిన మెత్తని నీటిమీద నురుగుతెట్టను పోలిన మొక్కలుండియుండవలెను. అయితే వృక్షములశాఖ, జంతువుల శాఖ మొదటినుండీ వేరువేరుగానున్నవా, మూలమైన ఒకే జీవపదార్థములనుండి వచ్చినవా? అనే ప్రశ్న ఉదయించవచ్చును. వృక్షములు, జంతువులు రెండు మూలమైన ఆకారములేని ఒక జీవపదార్థమునుండి పుట్టినవని చాలమంది శాస్త్రజ్ఞుల యభి



ప్రాయమైయున్నది. ఎజోయిక్ దశలో ఆరంభములోనే వృక్షముల శాఖ, జంతువులశాఖ, అమూలమైన జీవపదార్థ పరిణామములో విడిపోయి యుండవలెను.

అయితే ఈమూలమైన జీవపదార్థము ఎలా పుట్టింది? యిది జీవములేని పదార్థమునుండి పరిణామములో పుట్టియుండవలెను. జీవములేని పదార్థము శీతోష్ణ పరిస్థితివలన ఒక ప్రత్యేక విధముగా కలియుటవలన పుట్టియుండవలెను. మానవుని కింకను జీవములేని పదార్థమునుండి జీవమున్న పదార్థము చేయు విజ్ఞానము కలుగలేదు. అంతమాత్రమున జీవములేని పదార్థమునుండి జీవమున్న పదార్థము రాదని వాదించుట పొరపాటు. జీవమున్న పదార్థము జీవములేని పదార్థము నుండియే వచ్చియుండవలెను. లేకపోతే శూన్యమునుండి జీవమున్న పదార్థమెలా వస్తుంది ? పదార్థము పదార్థమునుండియే రావలెను. ఎక్కడనుండియో మహత్తుగా ఊడిపడదు.

(2) పాలియోజోయిక్ కొండలభాగము:— పాలియోజోయిక్ భాగముయొక్క కాలము 60 కోట్ల సంవత్సరములని అంచనా వేయబడినది. ఈభాగములో మొదటి జీవరాసుల యొక్క చిహ్నములు కనబడును. ఈభాగములో దొరకిన జంతువుల బొమికలు మొదలగు వానినిబట్టి మూడు ఉపభాగములుగా విభజింపవచ్చును. (1) నత్తలు మొదలగు పైగట్టి కప్పుగల జంతువుల కాలము (2) చేపలు మొదలగు వెన్నెముకగల ఊపిరితిత్తులులేని జంతువుల కాలము (3) కప్పలు మొదలగు నీటిలోనూ నీటిబయటనూ జీవించు జంతువుల కాలము

(1) నత్తలు మొదలగువాని కాలము:— వీనికి పూర్వపు జీవరాసులవలెగాక పైకప్పు గట్టిగా నుండును. నత్తకు రక్షణగా గుల్ల యుండును. ప్రమాదమును గ్రహించినపుడు నత్తగుల్ల లోనికి ముడుచుకుపోవును. సముద్రములో దొలకుఆలిచిప్పలలో ఉండు జంతువులుగూడ ఈజాతికి చెందినవే. ఇప్పుడు పీతలను పోలినజంతువులకు గుల్లలుపోలినవి ప్రత్యేకముగా లేవుగాని వీని శరీరముపై కప్పు గట్టిగా ఉండును. ఈకాలములోని చాలజంతువులు చాల చిన్నవేగాని ఈ కాలముచివరకు సముద్రపుతేళ్లు వచ్చినవి. ఇవి కొన్నికొన్ని తొమ్మిదియడుగులపొడుగుగా నుండెడివి. చాలచురుకుగా పోగలవు. ఈకాలములో ఇవి సముద్రములో రాజులుగా నుండియుండవలెను. ఈకాలము వృక్షజాతులు పూర్వకాలములో ఉన్న నురుగుతెట్టును పోలినమొక్కలు గాక చిన్నచిన్న గట్టికొమ్మలుగల సముద్రపుమొక్కలు బయలుదేరినవి. నత్తగుల్లలు ఆలిచిప్పలతోపాటు ఈకాలమునాటి కొండభాగములో ఈ మొక్కలయాకారములుగూడ నున్నవి. కాని యీజీవరాసు లన్నియు నీటిలో ఉండెడివని యింతవరకూ భూమిమొక్కలు జంతువులుగా ఉండుటకు అనుకూలము కాలేదని గ్రహించాలి. మెత్తనిశరీరముగల జంతువులనుండి గట్టిశరీరముగల జాతు లెలా వచ్చినవి ? మెత్తనిశరీరముగల జంతువులు సముద్రపుఒడ్డునకు త్రోసివేయబడి అలా వెనుకకు పోగానే యివి అక్కడ మిగిలిపోయి యుండవలెను. ఇవి నీటిలోనుండే మెత్తనిశరీరముగల జంతువులుగనుక శరీరముమీద తడి ఆరిపోయి మొట్టమొదట నీటిఒడ్డున చనిపోయి ఎండిపోయి యుండవలెను.



నెమ్మది నెమ్మదిగా ఒంటితడి ఆరిపోకుండా గట్టి పైకప్పులను ఈ జంతువులు పెంచవలసివచ్చెను. జీవించడానికి అవసరము గనుక కొంతకాలములో ఈజంతువులు పైకప్పులను గట్టివానిని పెంచియుండవలెను. మొదట తడి ఆరిపోకుండ నుండుటకు పెంచినపైకప్పులు, ఇతరజంతువులనుండి రక్షించుకొనుటకు యింకా గట్టిగా చేయబడెను. ఆ రకముగా కొత్తపరిస్థితులకు అనుకూలముగా మారలేనిజంతువులు ఒడ్డుమీద ప్రకృతికి ఆహుతి చేయబడియుండవలెను. జంతువులవలెనే ఒడ్డుకు కొట్టుకొనిరాబడిన తెట్టును పోలినమొక్కలు క్రమక్రమమున లోపలతడి ఆరిపోకుండగా గట్టికప్పును పెంచియుండవలెను.

చేపలకాలము:—పాలియోజోయిక్ కొండలలోనే తరువాత భాగములో ప్రస్తుతము మనకు కనబడుచున్న చేపనుపోలిన వెన్నెముకగల జంతువుయొక్క బొమికలు దొరికినవి. ఈ భాగమునే భూశాస్త్రజ్ఞులు సిల్యూరియన్ భాగ మన్నారు. దీని తరువాతభాగమైన డివోలియను ఈ చేపలజాతికి జెందిన యనేక రకములైన చేపల బొమికలు దొరకినవి. అందువలన ఇది చేపల కాల మని పిలువబడినది. ఈ చేపలు ప్రస్తుతమున్న చేపలవలె ఒకదానిమీద పడి వేటాడుతూ జీవించియుండవలెను. ఈ చేపలలో చాల మూడు అడుగులకన్న పెద్దవి యుండెడివిగావు గాని అరుదుగా 20 అడుగులపొడవుగల చేపలుగూడ నుండెడివి. ఈ చేపలయొక్క పూర్వీక జంతువుల (Ancestors) ను గూర్చి ప్రత్యక్షముగా తెలియదు కాని జంతుశాస్త్రజ్ఞులు పూర్వపు చేపలకు చెందిన ప్రస్తుతచేపల గ్రుడ్ల అభివృద్ధిని పరిశీలించి క్రింది

సారాంశాన్ని తేల్చారు. ఈ వెన్నెముకగల చేపలయొక్క పూర్వీకజంతువులు ఒకమాదిరిగా మెత్తని శరీరముగల గట్టి పండ్లను పెంచుచున్న ఇదే జంతువులు ఇప్పుడు ఉన్న డాగ్ ఫిష్ అను ఒకరకము చేపయొక్క పళ్లు నోటిదగ్గరనున్న గట్టిపొలుసులలోనుండి ఉత్పత్తియైనవి. దానినిబట్టి చేపలకు పూర్వీకములైన జంతువులుగూడ తమతోలునుండియే పండ్లను పెంచియుండవలెను. చేపలకు పూర్వీకమైనజంతువులు వెన్నుబారునఉన్న జీవనరమును రక్షించుటకు వెన్నెముక యుండేదిగాదు. ఆ జంతువులు ఆ జీవనరమును రక్షించుటకు దానిచుట్టూ వెన్నెముకను క్రమముగా పెంచియుండాలి.

కప్పలకాలము:—చేపలవరకూఉన్న జీవరాసులు అన్నీ నీటిలో చరించేడివే. అంతవరకు భూమిమీద ఏ జీవరాశియు లేదు. చేపలకాలము ఆఖరునాటినుండి భూమిమీదకు జీవరాసులు వ్యాపింప మొదలుపెట్టినవి. మొట్టమొదట భూమిమీదకు మొక్కలు సముద్రమ్మునుండి కొట్టుకువచ్చినవి. భూమిమీద జీవించవలెననిన సూర్యరశ్మి తగులుటకుగాను తిన్నని గట్టికొయ్య లాంటి మొదలు గలిగి యుండవలెను. సముద్రములోవలెనే నీరందుబాటులో ఉండదు గనుక భూమిలోవున్న నీళ్లను తీసుకొనుటకు వ్రేళ్ళను గలిగియుండవలెను. నెమ్మది నెమ్మదిగా భూమిమీద మొక్కలు సూర్యరశ్మిని పొందుటకు గట్టిమొదళ్ళనూ భూమినుండి నీటిని తీసికొనుటకు వ్రేళ్ళనూ అభివృద్ధిచేసినవి. ఈ చెట్లు పూర్వపు సముద్రపు మొక్కలవలెగాక చాల పెద్దవి.



ఈ చెట్లనుబట్టి క్రమముగా నీటిలోఉన్న జీవరాసులు భూమిమీదకు వ్యాపింపజొచ్చినవి. నత్తలు, పీతల లాంటి అనాదిజంతువులు వచ్చినవి. చిన్నచిన్నపురుగులు వచ్చినాయి. పూర్వకాలమునాటి సముద్రపుతేళ్లు వచ్చినాయి; ఇవి భూమిమీద తేళ్ళు అయినాయి. పురుగులు రెక్కలు అభివృద్ధి చేసుకొనినవి. ఈకాలములో డాగోక్లెయిస్ అను పురుగుల రెక్కలు 29 అంగుళము లుండేవట! వీనితోపాటు వెన్నెముకగల చేపలు మొదలగునవి వ్యాపించుజొచ్చినవి. భూమిమీదకు వచ్చేవరకు ఈ జీవరాసు లన్నీ నీటిలో కలిసియున్న గాలిని పీల్చి జీవించుచుండెడివి. కాని యివి అనేకవిధములైన భూమిమీద గాలి పీల్చుటకు కావలసిన అంగాలను అభివృద్ధిచేసినవి. అంతేగాక నీటిలో నుండునపుడు శరీరమును తడిగా నుంచుటకు ప్రత్యేక అంగాలు అవసరం లేకపోయినవి. కాని భూమిమీదకు వచ్చిన తరువాత అట్టి అంగాల అవసరము వచ్చినది. క్రమముగా భూమిమీద జీవరాసులు శరీరమునకు తడిని సప్లయిచేయు అంగములనుగూడ విధవిధములుగా అభివృద్ధిచేసినవి. పూర్వకాలము చేప తన గిల్సు (Gills) ను పోగొట్టుకొని నోటిలోనుండి ఈతిత్తులను లోపలకు పెంచి ఊపిరితిత్తులుగా మార్చివేసి గాలిని పీల్చుట కలవాటుపడినది. ఈవిధముగా కప్పజాతిగా మారిపోయినది. కప్పపిల్లలు నీటిలో జీవితాన్ని మొదలుపెట్టి చేపలవలె గిల్సుద్వారా నీటిలో కలసియున్న గాలిని పీల్చుతున్నవి. చేపలకు ఉన్న ఊపిరితిత్తులవలెనేయున్న తిత్తిని అభివృద్ధి చేయుచున్నవి. అటుతరువాత భూమిమీదకు వస్తుంది.

గిల్‌స్లిట్సు (Gillslits) పోయి చెవిరంధ్రములుగా మారిపోవును. ఇప్పుడు ఆ కప్పపిల్ల గాలిలోనే జీవించును. కాని కప్ప గ్రుడ్లను పెట్టుటకు నీళ్ళలోనికి వెళ్ళవలయును.

ఈ కాలములో భూమిమీదనున్న వెన్నెముకగల జంతువులు, మొక్కలు నీరు, భూమి రెంటి ఆధారముమీద బ్రతుకుతాయి. ఈకాలములో భూమిమీదనున్న వెన్నెముకగల జంతువులన్నియు గ్రుడ్లను పెట్టుటకు నీటిలోనికి పోవలసినదే. నీటిలోనే పిల్లలు పెరిగి పెద్దవయిన తరువాత భూమిమీదకు వస్తాయి. అందువలన ఆ కాలపు జంతువులు భూమిమీద నివసించినా నీటిదగ్గర నివసించేవి. ఈ విధముగానే ఆ కాలపు మొక్కలుగూడ నీటిదగ్గరనే జీవించేడివి. నీటికి దూరముగానున్న కొండలమీద ఏ విధమైన మొక్కలుగాని లేవు. ఆ కారణమున ఈ కలుపు మొక్కలు అభివృద్ధికావలయుననిన నీరు దగ్గరగా నుండవలెను. ఈ మొక్కలు ఇప్పటికాలపు మొక్కలవలె నేలమీద పడి మొలిచి కాయలు కాయలేదు. ఆ మొక్కలు సోర్సు అనే కణముగలిగిన చిన్న మొక్కలను నీటిలో వదలెడివి. ఆ సోర్సు నీటిలో క్రమముగా పెద్దవయి నీటిలో కొట్టుకొని ఒడ్డుకు వచ్చి క్రమముగా పెద్దవయ్యేవి. కనుక ఆకాలపుచెట్లుకూడా నీటిప్రక్కనే యుండాలి. అందువలననే ఆకాలపుచెట్లును వెన్నెముకగల జంతువులును నీటిలోను బయటనుకూడ జీవించే జంతువులన్నారు. ఈ జీవరాసులు మొదట నీటినుండి భూమిమీదకు వచ్చినవని పైన చెప్పినది రుజువుచేయుచున్నది.



(3) మెసోజోయిక్ కొండలభాగము:— ఈ భాగము యొక్క కాలము 12 కోట్లసంవత్సరాలని భూశాస్త్రజ్ఞులు అంచనావేసినారు. ఈకాలములో పాములు, బల్లులు, మొసళ్ళు మొదలగు రెప్టయిల్సు అను జాతి జంతువులు విపరీతముగా నుండుటచే దీనిని రెప్టయిల్సుకాల మనికూడ అందురు. పాలియోజోయిక్ కొండల ఆఖరుభాగములో ఇసుకరాళ్ళపొర లున్నవి. వీనిలో జంతువులబొమికలుగాని చిహ్నములుగాని చాలతక్కువ. దీనినిబట్టి యీకాలము అతిశీతలము, అతిఉష్ణము ఒకదానితరువాత నొకటి వెంబడివెంబడే వచ్చినవనీ అందువలన ఒకేరకమైన శీతోష్ణస్థితికి అలవాటుపడిన జీవరాసులు చాల చనిపోయినవనీ అతిశీతలము అతిఉష్ణము, వరుసగాఉన్న శీతోష్ణస్థితికి అలవాటుపడిన ఏకొద్దిజీవరాసులో మిగిలినవనీ శాస్త్రజ్ఞులు ఊహించుచున్నారు. ఈ కష్టకాలములోనే జీవరాసులు కొత్తపరిస్థితులకు అన్వయించుచూ త్వరత్వరగా మారినవి. కష్టకాలములోగాని చురుకుపుట్టదు. ఈ విధముగా కప్పలుమొదలైన ఏంఫీబియన్ జంతువులనుండి పాములు, మొసళ్ళుమొదలయిన రెప్టయిలుజాతి పరిణామమొందినది.

పై చెప్పిన అత్యుష్ణ అతిశీతలకాలములలోనే అంతకుముందు అభివృద్ధిచెందిన వృక్షజాతిలో చాలభాగము నశించిపోయినది. ఈ నశించిపోయిన వృక్షములమీద క్రొత్తపొరలు కూడుకొనుటమూలమున ఆ ఒత్తిడికి ఆ వృక్షములు ఇప్పుడు మనము గనులనుండి తీయుచున్న బొగ్గుగా మారిపోయినవి. పై శీతోష్ణస్థితికి అనుకూలముగా మారిన వృక్షజాతులు నిలిచి

యున్నవి. ఈ విధముగా పూర్వకాలపు సముద్రముప్రక్కన బుర
దలో ఉండి జీవించేవృక్షములనుండి విత్తనములు కాయలు గట్టి
భూమిమీద జీవించేవృక్షజాతులు పరిణామము జెందినవి. పూర్వ
కాలము వృక్షజాతులన్నీ స్పోర్సను చిన్నమొక్కలను నీళ్ళలో
వేసి తమరాసులను అభివృద్ధిచేసుకొనేవి. కాని ఈక్రొత్తవృక్ష
ముల రాసులన్నిటి అవసరం లేకుండా వానయొక్కతడిచే మొలిచే
గింజలను కాచేవి. ఈకాలములో ప్రస్తుతము మనము చూచు
చున్న తాడిచెట్లను బోలినచెట్లు భూమిమీదకు వచ్చినవి. కాని
యింకా పూలు పూసే చెట్లు గడ్డి ప్రపంచముమీదికి రాలేదు.

మెసోజోయిక్ కొండలలో దొరకిన బొమికలకు సంబం
ధించిన వెన్నెముకగల జంతువులు గుడ్లను నీటిలో పెట్టవు. భూమి
మీదనే ఈగుడ్లలోనుంచి బయటకు వచ్చినపిల్లలు వానిజాతినే
పోలియుంటాయి. వీనికి, కప్పపిల్లలకు 'గిల్సు' గ్రుడ్డులో నుండగనే
వచ్చిపోవును. కప్పలపిల్లలవలె నీటిలో మొదటిదశలో గిల్సుతో
గాలి పీల్చ నవసరములేదు. పిల్లలకు మొదటినుండి గాలిని పీల్చే
ఊపిరితిత్తు లుంటాయి. వీనిక్కీ, వీనికిపూర్వం వెన్నెముకగల జంతు
వులకూ ముఖ్యభేదం యిదే. ఈ జంతువులజాతినే రెప్టయిల్సు
అందురు. ప్రస్తుతము మనము చూచుచున్న పాములు, బల్లులు,
మొసళ్ళు ఈజాతికి చెందినవే. ఇవిగూడ తమ పూర్వీకులవలెనే
గుడ్లను భూమిమీద పెడతాయి. పిల్లలు గ్రుడ్డునుండి బయటకు
వచ్చేటప్పటికే తల్లులను పోలియుంటాయి.

వెన్నెముకగల జంతువులేగాక పురుగులలోగూడ అనేక
మార్పులు వచ్చినవి. అవిగూడ క్రొత్తశీతోష్ణస్థితుల కనుకూల



ముగా వివిధరకాలుగా మారుతూవచ్చాయి. ఇప్పుడు మనము
చూచుచున్న పేడపురుగులు, బొద్దెంకలు వచ్చినాయి గాని యింకా
సీతాకోకచిలుకలు తేనెటీగలు మొదలగునవి రాలేదు.

పై చెప్పబడిన రెప్టయిల్సు ఇప్పుడు మనము చూచుచున్న
రెప్టయిల్సువలె భూమిమీద నివసించేవే. అలాగే యీకాలపు
వృక్షములుగూడ పూర్తిగా వేడిమిలో వృద్ధిపొందేవే. ఇప్పటికి
పూర్తిగా మొట్టమొదటిసారి భూమిమీద అభివృద్ధిచెందే వృక్ష
జాతులు జీవరాసులు ప్రపంచములోనికి వచ్చాయి. ఇదివరలో
నీటిఅంచున పెరిగేకప్పలు చెట్లు ఎలా ఆకాలములో ప్రాముఖ్యము
వహించేవో యిప్పుడు భూమిమీద అభివృద్ధిపొందే వృక్షజాతులు
రెప్టయిల్సు అంత ప్రాముఖ్యమును వహించాయి. ఇప్పుడు
మనకాలములోవున్న పాములు, తొండలు, మొసళ్లు, తాబేళ్ళ
కన్న అప్పటికాలపు పాములు, బల్లులు, తాబేళ్ళు, మొసళ్ళు
చాల పెద్దవి. ఇవేగాక యిప్పటికాలములో లేని అనేకమైన
పెద్దపెద్ద రెప్టయిల్సు అపుడుండేవి. వాతావరణ కనుకూలముగా
మారలేక అవి నశించిపోయినవి. వృక్షములు ఇప్పుడు ప్రపంచ
మంతటా వ్యాపింపజొచ్చినవి. వీనితోపాటు ఈవృక్షములమీద
జీవించే డిప్లొడోకస్ కార్నెగీ, జైగాంటోసార్సు అనే పెద్దపెద్ద
జంతువులుకూడ ఉండేవి. ఈ జంతువులు ఇంతవరకూ భూమి
మీద పుట్టినజంతువు లన్నిటికన్న పెద్దవి. డిప్లొడోకస్ కార్నెగి
అనేజంతువుల తలదగ్గరనుండి తోకవరకూ పొడవు 94 అడుగులు.
జైగాంటోసారస్ అనే జంతువు 100 అడుగుల పొడవు గలిగి
యుండేది. వీనిమీద జీవించే మాంసాహారులైన డైనోసార్సు,

డైనరోసార్సు అను భీకరమైన జంతువు లుండేవి. ఇదే రెప్టయిల్సుకు ఉన్నతమైనదశ. అటుతరువాత యీజాతి క్షీణించి పోయినది.

గబ్బిలాయిలకువలె ముందుకాళ్ళు ఎగరడానికి వీలుగలిగేటట్లు అభివృద్ధిచెందిన టెరిడాక్టిల్స్ అనే రెప్టయిల్సురాశి నశించిపోయినది. వెన్నెముకగల జంతువులలో ముందు ఎగిరిన జంతు వేది? కొన్ని రెప్టయిల్స్ ముందుగెంటుచూ అటుతరువాత చెట్లమీద ఎక్కి పురుగులను వేటాడటానికి దుముకుట యీ విధముగా ప్రయత్నముచేసి, క్రమముగా గబ్బిలాయి రెక్కలవలె తోలురెక్కలు వృద్ధిపొందించుకుని యుండాలి.

అంతేగాక కొన్ని రెప్టయిల్సు మరల నీటిలోనికి బోయి వ్రేళ్లమధ్య తోలును బాతుకాళ్ళవలె అభివృద్ధిచేసుకొని నీటిలో యీదుట ప్రారంభించినవి. ఇవి కొన్ని కొన్ని పెద్దపెద్ద తిమింగిలములంత పెద్దవిగూడ అయినవి. పేజిమోసార్ అనే జంతువుకు సన్నని పామును బోలిన మెడ యున్నది. ఇది ప్రస్తుతము బాతువలె నీళ్ళలో తలను ముంచి ఆహారమును సంపాదించి జీవించియుండవలెను.

<u>మొట్టమొదటిపక్షులు, మామ్మల్సు (పిల్లలకు పాలిచ్చు జంతువులు)</u> :—డయినోసార్సు, టెడాక్టిల్సు అనే రెప్టయిల్సు ప్రాముఖ్యముగా నున్న కాలములోనే కొన్ని అప్రాముఖ్యమైన రెప్టయిలురాసులు శీతోష్ణస్థితులు బాగుగ సహించడము అలవరచుకొనుచున్నవి. కొన్ని గంతులు వేయుచు నడుచు రెప్టయిలు రాసులు తమశత్రువులనుండి తప్పించుకొని శీతలప్రదేశములగు



ఎత్తైన కొండలలోనికల్లా బోయి తలదాచుకోవాలి లేదా శత్రువులచేతులలో జిక్కి నశించాలి. ఈరాసులు క్రమముగా మొదట ఒకరకమైన పొలుసులను అభివృద్ధిపరచినాయి. అటుతరువాత అవి పొడుగుగా సాగించబడినాయి. ఆ పొడుగుపాటి పొలుసులే చిలవలు పలవలు వేసి ప్రస్తుతము పక్షులకుండు ఈకలుగా తయారయినవి. ఈయీకలుచలినుండి వీనినిరక్షించడానికి తోడ్పడినాయి. అందువలన పైజెప్పిన రెప్టయిలురాసులు శీతలప్రదేశములలో నివసించుటకు వీలు కలిగింది. మొట్టమొదటి పక్షులకు రెక్కలు లేవు. ఇంకా ముందుకాళ్ళు రెక్కలుగా అభివృద్ధి కాలేదు. ముందు కాళ్ళు యిపుడున్న పెంగ్వ్యయిన్‌పక్షికి వలె తెడ్లవలె యుండేవి. ఇది నీటిపురుగులు చేపలమీద జీవించి యుండవలెను. మొట్టమొదలు పక్షులజాతికి చెందిన కివి యనే పక్షి యిప్పటికినీ న్యూజిలాండులో నున్నది. దీనికి సాధారణమైన యీక లుండవు. ఇది ఎగురలేదు. ఎగిరే టెరిడాక్టికల్ తెగనుండి వచ్చినట్లుగా గూడ కనబడదు. ఈ మొట్టమొదట పక్షులరాసులనుండి రెక్కలున్న ఎగిరేపక్షులు వచ్చినవి. ముందు కాళ్ళు రెక్కలుగా అభివృద్ధియై యుండవలెను. పక్షులు రెప్టయిల్సు నుంచి పరిణామముజెందినవని రుజువుచేయుటకు ఒకఆధారము దొరకినది. రెప్టయిల్సు యొక్క పండ్లు పొడుగాటి తోకను పోలిన పండ్లతోగలిగిన మామూలు పక్షులవలె ఎగురుటకు పనికివచ్చు రెక్కలు గలిగినపక్షులయొక్క అస్థిపంజరము దొరకినది.

<u>మొట్టమొదట మేమల్సు అనగా పిల్లలకు పాలిచ్చి పెంచే జంతువులు</u> :- మెమల్సులో పిల్లి, ఎలుక, ఆవు గాక కోతు

మనుష్యులుగూడ వస్తారు. మొదట ఇవిగూడ తమ జీవితాన్ని కాపాడుకోవడానికి చలిప్రదేశములకు పోయి అక్కడ చలినుండి రక్షించుకొనుటకు పక్షులవలెనే పొడుగాటి పొలుసులను అభివృద్ధిపరచినవి. ఆ పొలుసులు ఈకలవలెగాక వెంట్రుకలను అభివృద్ధిపరచినవి. మొట్టమొదటి మేమల్సు చాలకాలమునుండి యుండియుండవలెను. కాని డయనోసార్సు కాలములో అతి చిన్నవిగానుండి అంత ప్రాముఖ్యమును వహించియుండవు. మేమల్సుగూడ రెప్టయిల్సునుండి పరిణామము చెందిన వనుటకు ఒక ఆధారమున్నది. స్తనములు కొద్దికొద్దిగానున్న గుడ్లను పెట్టె బాతుముక్కులు గల ప్లాటిపస్, ఎకీడ్నా అను మామూలు తెగకు జెందిన జంతువు లున్నవి. ఇవి తోలుగ్రుడ్లను పెట్టి పొట్టక్రిందనున్న సంచిలో పెట్టుకొని పొదుగుతాయి. పొదిగిన తరువాత వాని చర్మమునుండి వచ్చు రసముతో వానిని పెంచుతాయి. ఇవి రెప్టయిల్సువలె గ్రుడ్లనుపెట్టును. మేమల్సువలె పెంచుతాయి.

పక్షులు మేమల్సు రెండుతెగలూ రెప్టయిల్సు తెగనుండి వేరయిన రెండుశాఖలు. వానికి రెప్టయిల్సుకు ఉన్న రెండు ముఖ్యభేదములు (1) రెప్టయిల్సు పిల్లలను పోషించవు. రెప్టయిల్సు గుడ్లనుమాత్రము పెట్టిపోతవి. వాటంతటవే పొదిగి పిల్లలవుతాయి. పిల్లలకు తల్లినిగూర్చి తెలియదు. ప్రపంచములోనికి వచ్చినప్పటినుంచి స్వంతంగానే అనుభవాన్ని సంపాదించినవి. పక్షులు మేమల్సు అట్లుగాక పిల్లలను పెంచుతాయి. కొన్నిరోజులు తల్లిపిల్లలు కలిసియుండుటవలన ఒక



దానినిగూర్చి ఒకటి అర్థముచేసుకోవటానికి వీలున్నది. పిల్ల తల్లి దగ్గరనుండి అనుభవము సంపాదించును. ఇందువలన ఈ తెగలు రెండూ రెప్టయిల్సువలెగాక మందలు మందలుగా నివసించడము అలవరచుకొన్నవి. మానవులలోవున్న సమాజములో నివసించు పద్ధతి పక్షులు మొదటిమేమల్సునుండి వచ్చుచున్నది. (2) రెప్టయిల్సు వేడినెత్తురుగల జంతువులు గావు. పక్షులు మేమల్సు వేడినెత్తురుగల జంతువులు. అనగా రెప్టయిల్సుయొక్క శరీరము వేడి వాతావరణవేడిమికన్న ఎక్కువగా నుండును. అందువలననే వీనికి శరీరములోని వేడిమి బయటకు పోకుండా వెంట్రుకలు ఈకలు అభివృద్ధి చేసినవి.

పక్షులకు మేమల్సుకు భేదము:—పక్షులు గుడ్లు పెడతాయి. వానిని పొదిగి పిల్లలను చేయును. మేమల్సు అట్లుగాక గ్రుడ్లుపెట్టవు. పొట్టలోనే పిల్లలను పెంచి యీనుతాయి. పక్షులకు స్తనము లుండవు. మేమల్సు స్తనములతో పాల నిచ్చి పెంచుతాయి. పక్షులకు రెక్క లుంటాయి. మేమల్సు నాల్గు కాళ్ళజంతువులు. నేలమీద నడచును. ఎగరలేవు.

శీతోష్ణస్థితియొక్క బలవత్తరమైనమార్పులకు అనుగుణ్యముగా పక్షులు మేమల్సు మారి రక్షించుకొన్నాయి. ఈశీతోష్ణస్థితి మార్పులకు అనుగుణ్యముగా మారలేని పెద్దశరీరముగల డైనోసార్సు, ప్లీజియోసార్సు, టెరిడాక్టిల్స్ మొదలగు రెప్టయిల్సురాసులు నశించినవి. అయినతరువాత ఈ శీతోష్ణ పరిస్థితులలో మేమల్సు విజృంభించినవి. ఇంతటితో రెప్టయిల్సు కాలము అఖరైపోయినది.

(4) కెయోనోజోయిక్ కొండలభాగము:—ఈ కాలములో ప్రాముఖ్యము వహించినజంతువులు మేమల్సు గనుక దీనిని మెమ్మాలియన్‌కాలముగూడ అందురు. ఎనిమిదికోట్ల సంవత్సరములకు పూర్వము ఆరంభమై యిప్పటివరకు వస్తున్నకాలాన్ని కెయోనోజోయిక్‌కాల మందురు. కెయోనోజోయిక్‌కాలము అగ్నిపర్వతాలు పగిలి భూమిఅంతా తారుమారగుటతో ఆరంభ మగుతుంది. ఈకాలము ఆరంభములోనే యిప్పుడు ఉన్న కొండలు ఆకారములు ఏర్పడినవని యూరపుఖండములోని ఆలప్సుపర్వతములు, హిమాలయపర్వతములు పుట్టినవి. ఇప్పటి ప్రపంచపటమును బోలినప్రపంచ మేర్పడినది. ఇప్పటిఖండములు సముద్రములను పోలినఖండములు సముద్రములు ఏర్పడినవి. దీనితో క్రొత్తరకమైనజీవితము ఆరంభమైనది.

కెయోనోజోయిక్ కాలారంభములోనే పచ్చగడ్డి మొట్టమొదటసారి ప్రపంచములోనికి వచ్చినది. పచ్చగడ్డి బీళ్ళుగా అయినది. దీనితో పచ్చగడ్డి తిని జీవించే మేమల్సు అభివృద్ధి జెందినవి.

వీనిని తిని జీవించే మాంసాహారులైన జంతువులుకూడ వచ్చినవి. మెసోజోయిక్‌కాలములో అప్రాముఖ్యముగా నున్న యీ మెమిలియన్ తెగ ప్రాముఖ్యం వహించినది. పెద్దపెద్ద మేమల్సుగూడ వచ్చినవి. కాని మెసోజోయిక్ కాలములో ఉన్న శాకాహారులు మాంసాహారులైన రెప్టయిల్సు తెగకు చాల భేదమున్నది. మొట్టమొదట మేమల్సు పిల్లలను పెంచి వదలి వేయుచున్నవి. కాని తరువాత మేమల్సు కలిసియుండటము



వలన ఉన్నలాభమును స్వభావసిద్ధముగా తెలుసుకొని మందలు మందలుగా ఉండుట ఆరంభించినవి. ఒకదానినుండి మరొకటి అనుకరణముచేయడం ప్రారంభించినవి. నష్టదాయకమైన విషయములను తెల్పు అరుపులను గ్రహించినాయి. కలసి శత్రువునుండి రక్షించుకొనడము నేర్చుకొన్నాయి. ఒకదానిని చూచి మరొకటి సహించడము నేర్చుకొన్నవి. కాని యీలక్షణాలు రెప్టయిల్ జాతికి లేనేలేవు.

రెప్టయిల్సుకు ఈమేమల్సుకు ముఖ్యమైన రెండవభేదము ఏమనగా మేమల్సుయొక్క మెదడు రెప్టయిల్సుయొక్క మెదడు కన్న చాల అభివృద్ధిచెందినదిగా ఉండవలెను. పురాతనమామెల్సు యొక్క మెదడే పెద్దపెద్ద రెప్టయిలు జంతువులకన్న కొంచెము పెద్దవి. అంతేకాక మేమల్సులోని ప్రతిరాశియొక్క మెదడు అభివృద్ధిచెందుచూవచ్చినది. ఉదాహరణకు "టైలంథోరియం" అనేజంతువు ఇప్పటి "రైనాసిరస్"కు పూర్వికజంతువు. కాని రైనాశిరస్‌యొక్క మెదడులో దానిమెదడు పదియవ వంతు కూడ నుండదు. మామల్సు మెదడు ఇంత యభివృద్ధి చెందబట్టియే మనము ఆవులు, గుఱ్ఱములు మొదలగువానిని పెంచ గలుగు చున్నాము. వానిచే పని చేయించగలుగుచున్నాము. యుయింటెథెరిస్, టైటానోథెరెస్ మొదలగు విపరీతాకారముగల జంతువులు పోయినవి. వానినుండి యిప్పుడు ప్రపంచములో ఉన్న ఒంటెలు, గుఱ్ఱములు, ఏనుగులు, లేళ్లు, కుక్కలు, సింహాలు, పెద్దపులులు, పరిణామము చెందినవి. గుఱ్ఱముయొక్క పరిణామమును గూర్చిన ఆధారములు చాల ఎక్కువగా భూశాస్త్ర

ములో ఉన్నవి. గుఱ్ఱముయొక్క పూర్వీకపుజంతువైన పందిని పోలిన జంతువునుండి, యిప్పటిగుఱ్ఱమువరకు పరిణామములో మధ్యనున్నదశల అస్థిపంజరాలన్నీ యున్నవి. అందుచే గుఱ్ఱము యొక్క పరిణామాన్నిగూర్చి తేలికగా చెప్పవచ్చును. అలాగే యిప్పటికంటెను పూర్వీకపుజంతువు "లామా"లను జంతువులని శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. ఇలాగే యింకా ప్రస్తుతమున్న అనేక జంతువుల పరిణామమునుగూర్చి రుజువు చేయబడినది.

## ప్రైమేట్సు (Primates)

జంతుశాస్త్రజ్ఞులు మామల్సును వివిధతెగలుగా విభజించారు. ఈతెగ లన్నిటిలోను ఉత్తమమైన తెగను ప్రైమేట్సు అన్నారు. లెమర్సు (సన్నని పొడుగుమూతిగల) కోతులు, ఏప్సు (తోకలులేని కోతులు) మనుష్యులను ఈ తెగలో పెట్టారు. కారణం యివన్నీ ఒకదానికి ఒకటి ఎక్కువగా సంబంధించి యుండుటయే.

కెయినోజోయిక్ కాలము సగభాగములో అనగా షుమారు నాలుగుకోట్ల సంవత్సరాలక్రితం యిప్పటికోతులను లెమర్సును పోలిన జంతువులు ఉన్నవని భూశాస్త్రమువలన తెలియుచున్నది. వీనియొక్క మెదడు ఇప్పటికోతులు లెమర్సు మెదడుకన్న చాల చిన్నది. కాన ప్రాథమికదశలోను ఉన్నదని తెలియుచున్నది. అటుతరువాత కెయినోజోయిక్ కాలము మధ్యలో ప్రపంచముయొక్క దీర్ఘమైన వేడిమివాతావరణము (world's great summer) పోయి చలివాతావరణము వస్తుంది. ఇటువంటి వేడిమి వాతావరణమూ పోయి చలివాతా



వరణము వచ్చుట కిది మొదటిసారి గాదు. ఇంతకుముందు ఒకసారి కప్పలుమొదలగు యాంఫీబియన్ తెగలకాలములో వేడిమి వాతావరణము పోయి చలివాతావరణము వచ్చినది. ఈ యాంఫీబియన్‌జాతుల ప్రాబల్యము తగ్గిపోయి రెప్టయిల్సు ప్రాబల్యము వచ్చినది. అంతకుముందు ఉన్న జంతువులలో ఈవాతావరణమునకు అనుకూలముగా మారిన జంతువులరాసులు బ్రతికినవి. మారలేనిరాసులు నశించినవి.

రెండవసారి రెప్టయిల్సు నివసించిన దీర్ఘమైన వేడివాతావరణముతరువాత వచ్చిన చలివాతావరణములో రెప్టయిల్సు నశించి మేమల్సు ప్రాబల్యం హెచ్చినది. ఇది మూడవ దీర్ఘమైన వేడివాతావరణము. ఈవిధముగా భూమియొక్క శీతోష్ణ స్థితులలో ఇంత గొప్పమార్పులు గలుగుటకు కారణము—సూర్యుని చుట్టూ భూమి తిరుగుచున్న మార్గము మారుట. భూమి తన చుట్టు తాను తిరుగుచున్న లైను (Axis) మారుట భూమి యొక్క అంతర్భాగములో మార్పులు వచ్చుట సూర్యునిలో మార్పులు వచ్చుటయై యుండును.

కెయోనోజోయిక్ మధ్యకాలమునుండి అనగా నాలుగు కోట్ల సంవత్సరములకు పూర్వము ఆరంభమైన చలివాతావరణము ఇప్పటికి సాగుతూనేయున్నది. ఈ మధ్యకాలములో చలివాతావరణము అప్పుడప్పుడు పోయి కొద్దికాలముమాత్రము కొంత వేడిమివాతావరణము వచ్చేది. వీనినిబట్టి యీ చలివాతావరణమును నాలుగుభాగములుగా భూశాస్త్రజ్ఞులు విభజించారు. వీనిని గ్లేషియల్ ఏజెస్ (Glacial ages) అని పిలిచారు.

మొదట గ్లేషియల్ ఏజిలో ఎక్కువ చలి 6 లక్షల సంవత్సరములక్రితం వచ్చింది. నాల్గవ గ్లేషియల్ ఏజి ఎక్కువ చలి 50 వేలసంవత్సరములక్రితం వచ్చినది. ఈపెద్దచలివాతావరణములో ఉత్తర ధ్రువమునుండి మంచు భూమిని కప్పివేయుచూ యింగ్లాండులో థేమ్సునదివరకు అమెరికాలో ఒహియోవరకు వచ్చింది. దీనితోపాటు జీవరాసులను చంపుకొంటూ యీమంచుకప్పు వచ్చినది. ఈపెద్దచలివాతావరణములో దీని కనుకూలముగా మారలేని పెద్దపెద్దమెమల్సురాసులు నశించినవి. మారినకొన్ని మాత్రం బ్రతికినాయి. ఈకాలములోనే బొచ్చుగల రెయినాసిరసులు, దుప్పిలాంటి రెయిన్‌డీర్ యిప్పటి ఏనుగుకు పూర్వికమైన బొచ్చుగల జంతువులు వచ్చినాయి. వృక్షములుగూడ మార్పుజెందినవి. చలికాలములో ఆకులు రాల్చుకొని మంచులో గూడ బ్రతికేచెట్లు వచ్చినవి.

కెయోనోజోయిక్ కాలములో 4 కోట్ల సంవత్సరాలక్రితం ఆరంభమైన పెద్దచలి వాతావరణమునకు ముందు కోతులున్నూ, లెమర్సునుపోలిన జంతువులు వచ్చినవి. తరువాత నాల్గవ గ్లేషియల్ ఏజిలో అనగా 50 వేల సంవత్సరాలకు పూర్వం ఆ మంచులో మొట్టమొదటిసారి మనిషిఆకారమును బోలిన జీవము జీవించింది. ఈ మధ్యకాలములో కోతులనుండి ఈ మనుష్యుని ఆకారమును బోలిన జీవమువరకూ పరిణామము ఎలా జరిగినది? కోతులు లెమర్సుతరువాత తోకలులేనికోతులు (ఏప్సు) వచ్చినవి. ఇవి తోకలు లేకపోవడమువలనను కాలిబొమికలు నిర్మాణములోనూ కోతులకన్న మానవులకు దగ్గరగా ఉండును. అటు



తరువాత సుమారు 5, 10 లక్షల సంవత్సరాల మధ్యకాలానికి సంబంధించిన చెకుముకిరాళ్ళతోను ఇంకా ఇతర గట్టిరాళ్ళతో చేయబడిన పదునయిన అంచులుగల ఆకురాళ్ళు దొరికినవి. వీనిని మామూలు ఏప్సుచేసియుండవు. ఆయుధాలు దొరికినాయి. వీనిని కూడ మామూలు ఏప్సుచేసియుండవు. అంతకన్న ఉన్నతమైన మానవునికి దగ్గరగానున్న జీవములే అవి చేసియుండవలెను. కాని ఈ జీవముల అస్థిపంజరములు విరివిగా దొరకలేదు. జావా ద్వీపములో టనిట్ అనుచోట ఒకపుర్రె, పళ్ళు, కొన్ని బొమికలు దొరికినవి. శాస్త్రజ్ఞులు వీనిని పైచెప్పిన రాతి ఆయుధాల కాలానికి చెందినవే యని నిర్ధారణజేశారు. ఆ అస్థిపంజరముగల జీవము తిన్నగా నడువగలదు. ఇప్పుడువున్న ఏప్సుయొక్క మెదడుకన్న దానిమెదడు చాలపెద్దది. అందువలన యిది ఏప్సురాశికన్న ఉన్నతరాశికి చెందియుండవలెను. అందువలన దీనికి జంతుశాస్త్రజ్ఞులు నడిచే ఏప్ మనుష్యుడు అని పేరు యిచ్చారు.

హీడెల్‌బర్గ మనుష్యుడు:—కాలము జరిగేకొలదీ మనుష్యులకూ కోతులకూ మధ్యగాఉన్న జీవాలు మంచివైన పెద్దవైన ఆయుధాలు చేయుచూ జీవిస్తూఉండేవి. హీడిల్ బర్గ అనుచోట ఒకయిసుకగోతిలో గడ్డములేనిమనుష్యుల దవడ బొమికకన్న పెద్దదయిన, వికృతిగానున్న, కొంతవరకు మనుష్యుని దవడయెముకనుబోలిన ఒకదవడయెముక దొరికింది. దీనినిబట్టి ఈజీవము మనుష్యునికన్న చాల పెద్దదే. వెంట్రుకలు దట్టమై శరీరమంతా నిండియుండి యుండవలెను. దాని దౌడఎముక విధానాన్నిబట్టి యిది మాట్లాడలేదని జంతుశాస్త్రజ్ఞులు నిర్ణయిం

చారు. ఇది 2 లక్షల 50 వేల సంవత్సరాలకు పూర్వము ఉన్న జంతువని జంతుశాస్త్రజ్ఞులు అంచనావేశారు. ఈజంతువుకాలాన్ని బట్టి ఆకారాన్నిబట్టి నడిచే ఏప్ మనిషికన్న మనుష్యునికి దగ్గరగా ఉండియుండాలి. హీడెల్ బర్గులో దానిదవడబొమిక దొరికినది. కనుక హిడెల్ బర్గు మనుష్యుడని శాస్త్రజ్ఞులు పేరు పెట్టారు.

పిల్ట్ డౌన్ మనుష్యులు:—యింగ్లాండులో పిల్టుడౌన్ అనేచోట ఇప్పుడువున్న ఏప్పు పెద్దపుర్రెయొకటి, ఒకదవడ ఎముక పెన్నిసుబాటుఆకారములో చేయబడినకంత, చేయబడిన ఒక ఏనుగబొమిక గజుబద్దవలె గీతలుగీయబడియున్న లేడి యొక్క కాలిబొమిక దొరకెను. ఈ ఏనుగబొమిక ఆయుధ ముగా చేయబడినవిధమును ఆలోచించిన ఈజీవి హేడెల్ బర్గు మనుష్యునికన్న ఎక్కువ తెలివిగలవాడని రుజువగుచున్నది. ఇంతేకాక ఈకాలమునకు సంబంధించిన రాతికత్తులు, విసిరేరాళ్ళు మొదలైన ఆయుధాలుగూడ దొరకినాయి. వీనినిబట్టి ఈమను ష్యుడు హెడెల్ బర్గు మనుష్యునికన్న నిజమైన మనుష్యునికి దగ్గ రగా నున్నాడు. ఈపిల్ట్ డౌనుమనిషి నిజమైనమనిషికి ఇంతదగ్గరగా ఉన్నా జంతుశాస్త్రజ్ఞులు నిజమైనమనుష్యునియొక్క పూర్వీకుడు (ancestor) కాడని చెప్పుచున్నారు. ఈమనిషియొక్క కాలము ఇప్పటికి షుమారు 100,150 వేల సంవత్సరము లుండు నని అంచనావేయబడినది.

నీండన్ థాల్ మనుష్యుడు:—ఇప్పటికి షుమారు 50 వేల సంవత్సరములకుపూర్వం నాల్గవ గ్లేషియల్ ఏజిలో చలితీవ్రతలో ఆఖరిదశకు పోకపూర్వం ఒకరకం మనుష్యుడు ప్రపంచములో



నివసిస్తుండేవాడు. ఈతనిని కొద్దిసంవత్సరముల క్రితంవరకూ దరి దాపు మనుష్యుడే అనుకొనేవారు. నీండల్ థాల్ అనేచోట ఈరకం మనుష్యునిపుర్రెలు ఎముకలు దొరికినాయి. అందుచే నీండల్ థాల్ మనుష్యుడు అని పిలువబడుచున్నాడు. ఈ మను ష్యుడు ఉపయోగించిన ఆయుధములు, పనిముట్లుగూడ చాల దొరికినవి. ఈతనికి నిప్పుచేయుట తెలుసును. కొండగుహాలలో ఉండి చలినుండి రక్షించుకొనేవాడు, తోళ్ళను ధరించేవాడు. మనుష్యులవలెనే కుడిచేతితో ఎక్కువపనులు చేసేవాడు. అయి నప్పటికీ జంతుశాస్త్రజ్ఞులు ఇతడు నిజమైన మనుష్యుడు కాడని చెబుతారు. ఈ మనుష్యునికి బరువైన, ముందుకు పొడుచుకొని వచ్చిన దవడ ఎముకలున్నవి. నుదురు చాలలోతుగా ఉండేది. ఎత్తైన కనుబొమ్మలు వుండేవి. ఈతని బొటనవ్రేళ్ళు మనుష్యుని బొటనవ్రేళ్లను పోలియుండవు. అతడు నిజమైన మనుష్యుడు కాడు. ఆకాశమువంక చూడలేడు. అతనిమెడఎముకలు ఆ విధ ముగా అమరిఉన్నవి. అతడు తల వంచుకొని నడచియుండవలెను. అతనిగడ్డము లేని దవుడఎముకలు నిజమైన మనుష్యునివలెగాక హీడెల్ బర్గు మనుష్యుని పోలియున్నవి. అతని దంతములుగూడ మనుష్యుని పోలియుండేవి గాదు. అతని మెదడు మనుష్యుని మెదడుకన్న ముందుభాగము చిన్నదిగాను, వెనుకభాగము పెద్దది గాను వున్నది. ఇతనికి కోరలు లేవు. అందువలన ఇతడు ఎక్కువగా శాకాహారి యని తేలుచున్నది. కాని గుహాలలో ఇతని పగలగొట్టబడిన ఎముకలు ఉన్నవి.

దానినిబట్టి ఇతడు తరువాతతరువాత అతిశీతల వాతావరణములో మాంసాహారముగూడ నేర్చుకొనియుండవలెను. ఇతనియొక్క ఆయుధాలు వేటకు అంత అనువుగా ఉండేవిగాదు. ఇతడు గోతులలో ఉపాయముచేత జంతువులను పడవేసేవాడని గూడ శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అంతేగాక పెద్దపులి తినగా మిగిలిన మాంసమును ఇతడు నక్కవలె భుజించేవాడనిగూడ చెబుతారు. ఇతని దవడల నిర్మాణాన్నిబట్టి మాట్లాడుటకు వీలు లేదనిగూడ జెప్పుతారు. ఇతడు పిల్టడౌను మనుష్యునికన్నా గూడా నిజమైన మనుష్యునికి ఇంకా దగ్గరవాడని అతనిఆకారము, చేష్టలు, ఊహాలు రుజువుచేస్తాయి. కాని యితడుగూడ నిజమైన మనుష్యుని పూర్వీకుడు గాడని జంతుశాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

రొడేసియన్ మనుష్యుడు :— 1921 సం॥ దక్షిణాఫ్రికాలో బ్రోకెన్ హిల్ లో ఒకపుర్రె, కొన్నిఎముకలు దొరికినవి. వీనినిబట్టి ఇతనిపోలికలు నీండల్ థాల్ మనుష్యునికి, నిజమైన మనుష్యునికి మధ్యగా నున్నవి. అతనిమెదడు నీండల్ థాల్ మనుష్యుని మెదడుకన్న ముందు పెద్దదిగాను, వెనుక చిన్నదిగాను ఉంది. అతడు మనుష్యునివలె తిన్నగా నడిచేవాడు. ఆకాశమువంక చూచేవాడు. పండ్లు, చాలఎముకలు మనుష్యుని పోలి యుండును. కాని ఇతని ముఖముమాత్రము ఏప్ వలె నీండల్ థాల్ పోలియుండును. కనుక అతడు నీండల్ థాల్ నిజమైనమనిషికి పూర్వీకుడేమోనని జంతుశాస్త్రజ్ఞులు అనుమానించుచున్నారు. కాని ఇంకను రూఢిపరుపబడలేదు.



షుమారు ఇప్పటికి 35 వేలసంవత్సరములక్రితము వాతావరణము వేడివాతావరణముగా క్రమముగా మారుచున్నప్పుడు ఇంతవరకు వివరింపబడిన మనుష్యులరాసులకన్న, తెలితేటలుగల మాట్లాడు, ఒకరితో ఒకరు చక్కగా కలిసిమెలిసి పనిచేయు నిజమైన మనుష్యులరాశి ఒకటి దక్షిణమునుండి ఉత్తరమునకు వచ్చింది. ఈ రాశి నీండల్ థాల్ మొదలగు తమకన్న తక్కువగు వివిధరాసుల మనుష్యులను చంపి నాశనముచేసినారు. ఆరాశి నుండియే మనము పుట్టినాము. వీరే నిజమైన మనుష్యులందరు.

నిజమైనమనుష్యుడు :— నిజమైనమనుష్యుని యింక మనుష్యుడని వాడవచ్చును. మనుష్యుని అస్థిపంజరాలు, వారి ఆయుధాలు, ఇతరచిహ్నాలు స్పెయిను ఫ్రాన్సులలో ఎక్కువగా దొరికినవి. ఆఫ్రికా ఆసియా ఖండములలోకూడ దొరకవచ్చు. కాని ఎవ్వరును అంతశ్రద్ధపట్టి ఇంతవరకు ఆఫ్రికా ఆసియా ఖండములలో పరిశీలించలేదు. వీరు ఆలుచిప్పలను దండలుగా గుచ్చి ధరించేవారు. వారు శరీరాలకు అందముకొరకు రంగు వేసుకొనేవారు. రాతితోను ఎముకలతోను ఎముకలు చెక్కేవారు. కొండలమీద, ఎముకలమీద బొమ్మలు గీసేవారు. జంతువుల, ఇతరవస్తువుల అందమైన బొమ్మలను రంగుతో గుహాలలో రాతిమీద వేసేవారు. వారు చాలరకములైన ఆయుధాలను పనిముట్లను చేసేవారు. ఇవి నీండల్ థాలర్ ఉపయోగించిన వానికన్న చిన్నవిగాను సున్నితంగాను ఉన్నవి. ఇప్పుడు వారు పోనీ అను గుఱ్ఱమును ఎక్కువగా వేటాడి తిని జీవిస్తూవుండేవారు. ఈ గుఱ్ఱముల బొమ్మలు కొన్నిగుహాలలో

చిత్రించబడినవి. వీరికి ఇంకా జంతువుల పెంపకము తెలియదు. మట్టితో బొమ్మలు చేసేవారు. కాని ఇంకా కుండలుచేయుట నేర్చుకొనలేదు. కనుక ఇప్పటికి వీరికి మాంసము వండుకొని తినుట చేతగాదు. పచ్చిమాంసాన్నే తినేవారు. మానవ సమాజములో ఈదశ మొట్టమొదటిదశ. మానవసమాజములో మొట్టమొదటదశకే రెండు వేరు వేరుతెగలకు జెందిన మనుష్యు లున్నారని రుజువగుచున్నది. ఒకతెగ చాలపొడుగు, పెద్దమెదడు కలవారు. క్రోమాగ్నన్ అనే కొండగుహలో ఈ తెగకు జెందిన 6 అడుగుల పొడుగుకుపైగాఉన్న పెద్ద పుర్రె ఉన్న అస్థిపంజరము దొరికినది. వీరు ఉత్తర అమెరికాలోని ఆదిమనివాసులైన రెడ్ఇండియన్లను పోలియుంటారు. వీరిని క్రోమాగ్నార్డు అంటారు. మరొకతెగ పొట్టివారు. ఈ తెగకు సంబంధించినవారి అస్థిపంజరములు గ్రిమాల్డికొండ గుహాలలో దొరికినవి. వీరు ఆఫ్రికానీగ్రోజాతి నిపోలియుంటారు. మొదటితెగ ఉత్తరమునుండియో తూర్పునుండియో వచ్చినదని, రెండవతెగ దక్షిణమునుండి (ఆఫ్రికా) వచ్చినదని శాస్త్రజ్ఞులు ఊహించుచున్నారు.



అధ్యాయము 3

# గతితార్కిక భౌతికవాదము

**(Dialectical Materialism)**

గతి అనగా చలనము, మార్పు. గతితర్కమనగా ప్రపంచములోని ప్రతివస్తువు, జీవి మార్పుజెందుచున్నదను వాదము. భౌతికవాద మనగా జ్ఞానేంద్రియాలతో తెలుసుకోబడు పదార్థమే నిజమైనది. ప్రాణము, ఊహాలు పదార్థమునకు సంబంధించినవే. దానిమీద ఆధారపడియుండునవే యని మొదటి అధ్యాయములో చెప్పియుంటిని. కనుక గతితార్కికభౌతికవాద మనగా "పదార్థము ఎల్లప్పుడూ మార్పుజెందుచున్నది; ఆ పదార్థమే నిజమైనది, మూలము. దానిమీదనే ఆధారపడియున్న ప్రాణము, ఊహాలు పదార్థము ననుసరించి మార్పుచెందుచున్నవి"

హెగెల్, మార్క్సు:—ప్రపంచములోని ప్రతివస్తువు, జీవము ఎల్లప్పుడూ మార్పు ఎలాజెందుచున్నవో ఆ సూత్రములను గనిపెట్టినది హెగెల్ అను జర్మను భావవాది. ఆయన పదార్థము నిత్యమైనదిగాదనీ, భావము (Idea) (హెగెల్ దేవునే భావ మన్నాడు) యొక్క ప్రతి బింబమనీ, అందువలన భావము కదలుచున్నరీతిని దాని ప్రతిబింబమైన ఈ ప్రపంచముగూడ కదలుచున్నదనీ చెప్పాడు. భావమే పదార్థానికి మూలమన్నాడు గనుక ఈయన భావవాది అయినాడు. మార్క్సు ఈయన శిష్యుడే. అయిననూ మార్క్సు భౌతికవాదదృష్టితో హెగెలు గతితర్కాన్ని పరీక్షించాడు. హెగెలు గతితర్కాన్ని తలక్రిందుగా

పెడితే 'గతితార్కికభౌతికవాద' మవుతుం దని చెప్పాడు. అనగా పదార్థాన్ని బట్టి భావాలు కదులుతాయని అర్థము. పదార్థముయొక్క మార్పులనుగూర్చి హెగెలు మూడు సూత్రాల నిచ్చాడు. ఒక్కొకదానిని ఈ క్రింద వివరించుచున్నాను.

1. ఉన్నది, లేదు (Being and Nonbeing) :—

ప్రపంచములో ఏవస్తువూ స్థిరంగా లేదు. అనుక్షణమూ మార్పు జెందుచున్నది. చలనము జెందుచున్నది. మనస్థూలదృష్టికి మన ముందు కనపడే కంకరరాయిలో మార్పు కన్పించదు. కాని అది నెమ్మదినెమ్మదిగా అనుక్షణమూ చిన్న చిన్న అణువులుగా అయి భూమిలో కలిసి పోవుచున్నది. ఆ గడ్డ ఒక క్షణములో ఒకదశలో ఉన్నది, లేదు. అనగా ఎప్పుడూ మారుచున్నదని అర్థము. అంతేకాక స్థూలదృష్టికి కనపడకపోయినప్పటికీ, ఆ కంకరరాయిలోనున్న అణువులన్నీ మన మూహించ లేనంత త్వరగా కదులుచూ, ఒకదానితో నొకటి ఢీకొనుచున్నవి. ఆ ప్రతి అణువు (atom) లోనూ ఎలెక్ట్రాన్ ప్రోటాన్ అను పరస్పర విరుద్ధమైన మరీచిన్నఅణువు లున్నాయి. ప్రోటానుల చుట్టూ ఎలెక్ట్రానులు తిరుగుచున్నవి. దానిని ప్రస్తుత శాస్త్రం రుజువు చేసింది. పదార్థము, చలనశక్తి ఒకదానితో ఒకటి ఎల్లప్పుడూ కలిసి ఉంటాయి. పదార్థాన్ని చలనశక్తినుండి గాని చలనశక్తిని పదార్థమునుండి గాని వేరుజేయుడానికి వీలులేదు. పైన ఉదహరించిన కంకరరాయివలెనే, మనము పడుకొనియున్న మంచం మనకు తెలియకుండానే మారుచున్నది. మారిమారి కొంతకాలానికి పాతదై విరిగిపోతుంది.



నడచుచున్న మోటారుకారునుగురించి ఆలోచించుదాం. అది ఒకక్షణములో ఒకచోటున ఉన్నది, లేదు. అనగా ఆగకుండా వరుసగా కదులుచున్నదని అర్థము. ఒకక్షణములో ఒకచోటున ఉన్నదని తెలుసుకొనేటప్పటికే ఆచోటునుండి మరొకచోటికి పోవుచున్నది. అనగా ఒకక్షణమును విభాగించిచూచినా, ఆ అరక్షణములోనూ అది కదులుచునే యున్నది. ఆ అరక్షణాన్ని ఇంకా భాగించిచూచినా కదులుచునే యున్నది. ఇంకా అలా ఆక్షణములో ఎంతచిన్న భాగమును చేసిచూచినా అది కదులుచునే యున్నది.

మనశరీరాన్నిగూర్చి ఆలోచించుదాము. మనశరీరము చిన్నిచిన్నికణములు (cells) కూడుకొనియున్నది. (ఏకకణములో అనేకఅణువు లుంటాయి) ప్రతిక్షణము కొన్నికణములు చని పోయి, మరికొన్నికణములు పుట్టుచున్నవి. చనిపోవుచున్న కణములకన్న పుట్టుచున్న కణములసంఖ్య ఎక్కువగా నున్నప్పుడు మనశరీరము పెరుగును. పుట్టుచున్నకణములకన్న చనిపోవుచున్న కణములసంఖ్య ఎక్కువైనప్పుడు మన శరీరము కృశించును. శరీరము ముడుతలు బడును. ముదుసలుల మగుదుము. అనగా మనశరీరము ఒకక్షణములో ఒకస్థితిలో ఉన్నది, లేదు. ఇలాగే ప్రపంచములోని జీవరాసు లన్నీ మార్పుజెందుచున్నవి.

మానవసమాజాన్ని గూర్చి ఆలోచించుదాం. మానవులు మొదట గుడ్డలులేక అడవులలో తిరుగుతూ మాంసము, పండ్లు తిని బ్రతుకుతుండేవారు. రానురాను ప్రకృతిని అర్థంజేసుకొన్నారు. నాగరికత ఎక్కువైంది. మేడలు, మిద్దెలు, మోటార్లు,

రైళ్ళు మొదలగునవన్నీ నిర్మింపబడినాయి. సౌఖ్యాలు ఎక్కువైనాయి. నిరుద్యోగము, ఆకలిబాధ లేని సోషలిస్టు సమాజము లోనికి ప్రపంచములో ఐదవభాగమైన సోవియటురష్యా మారి పోయినది.

కృష్ణానదికి ఆనకట్ట కట్టకపూర్వం మెట్టవ్యవసాయం జేసు కొనేవారు. రోడ్లులేవు. బురద డొంకలు. నీరుకావిగుడ్డలు. కృష్ణకు ఆనకట్ట వచ్చిది. కాలువలూ, రోడ్లు వచ్చినాయి. రైతుల ఆదాయం పెరిగింది. మేడలు లేచినాయి. తెల్లగుడ్డలు వచ్చినాయి (అయితే ఇవన్నీ ధనవంతులకే). మనగ్రామంలో చూడండి- ఇండ్లులేని స్థలాల్లో ఇండ్లు లేస్తున్నాయి; ఉన్నస్థలాల్లో పాడయి పోయి మొండిగోడ లవుతున్నాయి. ప్రపంచములోని ప్రతిపదార్థము ఎల్లప్పుడు మార్పు జెందుచునే యున్నది.

2. (అ) మొత్తము గుణముగా మారుట (quantity into quality) :— ప్రకృతిలో మార్పులు వరుసగా నెమ్మదిగానేగాక హఠాత్తుగాగూడ జరుగుతూ ఉంటాయి. మామిడిచెట్టును ఉదాహరణగా తీసుకొందాం. మామిడిచెట్టు కొంతఎత్తు పెరిగి, కొంత విస్తరించిన తరువాతగాని పూవులు పూయదు. కాయలు గాయదు. తరువాత మరల కొంత పెరుగుతుంది. మరల పువ్వులు పూస్తుంది. కాయలు గాస్తుంది. మామిడిచెట్టుకు కొంత పెరిగిన తరువాతగాని కాయలు గానే గుణము రాలేదు. ఇలాగే ఇతర వృక్షజాతిగూడ. మనుష్యులకు కొంత ఎత్తు, లావు పెరిగిన తరువాతగాని, యవ్వన లక్షణాలు ఏర్పడవు. ఇలాగే ఇతరజంతు కోటికిగూడా.



ఒకదారమునకు ఒక్కొక్కటిగా బరువులు గడితే కొంత మొత్తం రాళ్ళు గట్టేటప్పటికి ఆదారం తెగిపోతుంది. కొంత మొత్తం రాళ్ళు దారములో తెగేమార్పును తీసుకొని వచ్చినవి. ఒక అన్నంముద్ద తరువాత మరొక అన్నముముద్ద తింటూఉండగా కొంతమొత్తం అన్నం తిన్నతరువాత ఆకలి తీరుతుంది. కొంతమొత్త అన్నం ఆకలిని తీర్చింది.

సమాజములోగూడ ఇదేరకమైన మార్పులు జరుగుతూ ఉంటాయి. సమాజం కొంతవరకూ పెరిగినతరువాతగాని, (అనగా జనాభా, యంత్రాలు కొంత అభివృద్ధి అయిన తరువాత గాని) జమీందార్లు, రాజుల పెత్తనంబోయి, షావుకార్ల, మిల్లు యజమానుల పెత్తనం రాలేదు. అటుతర్వాత సమాజం కొంత అభివృద్ధి అయిన తరువాత రష్యాలో విప్లవం వచ్చి, పెత్తనం కూలీరైతుల చేతుల్లోకి వచ్చింది. ప్రపంచ మంతటా అటువంటి మార్పులు రానున్నాయి. సమాజం - మొదట ఆదిమ కమ్యూనిష్టు సమాజము- పితృస్వామిక సమాజంలోనికి, పితృస్వామిక సమాజము బానిససమాజములోనికి, బానిససమాజం జమీందారీ సమాజములోనికి ఇలాగే మారినది.

మరొక ఉదాహరణను తీసుకొందాం. ఒకగిన్నెలో నీటిని బోసి అందులో థర్మామీటరును వ్రేలాడగట్టి క్రింద మంట బెడితే పాదరసం నెమ్మదినెమ్మదిగా 100 డిగ్రీలవరకూ వెళ్ళి అక్కడ ఆగిపోతుంది. తరువాత ఎంత మంట బెట్టినా పాదరసం పైకి బోదు. గిన్నెలో నీరంతా ఆవిరి అవుతుంది. మొదట మంటవలన వచ్చినవేడిమి అంతా నీటియొక్క వేడిమిని ఎక్కువ

చేయుట కుపయోగపడినది. నీరు 100 డిగ్రీలు వేడి ఎక్కిన తరువాత వేడిమి అంతా నీటిని ఆవిరిచేయుట కుపయోగపడినది. ద్రవపదార్థమైన నీరు వాయుపదార్థమైనది. నీటికి వాయురూపమను క్రొత్తరూపం వచ్చింది. కొంతవేడిమి నీటియొక్క గుణములో మార్పును తీసుకువచ్చింది.

(ఆ) గుణము మొత్తముగా మారుట (quality into quantity) :—ప్రకృతిలో ఈసూత్రము ననుసరించి మార్పులు ఎక్కువగా కనుబడవు. ఆవిరిని నీటిగా మార్చే 100 డిగ్రీల వద్ద పాదరసం ఆగిపోయి ఆవిరి అంతా నీరు అవుతుంది. ఆవిరి యగుట కుపయోగించినవేడిమి అంతా మనకు తిరిగి వస్తుంది. అనగా ఆవిరియొక్క వాయుగుణము వేడిమి అను మొత్తముగా మనకు తిరిగి లభించినది.

(3) వ్యతిరేకములకు వ్యతిరేకము (Negation of Negation) :—ప్రపంచమంతా వ్యతిరేక వస్తువుల కలయికయే. పగలు, రాత్రి; పుట్టుక, చావు; చెట్టు, కాయ; మానవుడు, పిల్లలు పుట్టుటకు కారణమైన ఇంద్రియము; స్త్రీ, పురుషుడు; కార్మికుడు, పెట్టుబడిదారు; సామ్రాజ్యవాదం, జాతీయత; ఇంకా అనేకఉదాహరణ లున్నాయి. ఈవ్యతిరేక వస్తువులలో ఒకటి లేకుండా రెండోది లేదు. పగలు లేకపోతే రాత్రి లేదు, రాత్రి లేకపోతే పగలు లేదు; చెట్టు లేకపోతే కాయలేదు, కాయ లేకపోతే చెట్టు లేదు.

అయితే ప్రపంచములోని ప్రతివస్తువూ మార్పు చెందుతూ ఉన్నదని పైన చెప్పాను. ఈ వ్యతిరేక వస్తువుల కలయిక



కూడ మార్పు చెందుతూఉంది. ఈ మార్పు అభివృద్ధి మార్గములో జరుగుతూఉంది. అనగా ఈ మార్పు సైకిలుస్ప్రింగు (spiral) లాగా జరుగుతూఉంది.

ప్రపంచములో ప్రతిదానికి పుట్టుక చావులు ఉన్నవి. చెట్లు నశించుట చూస్తూఉన్నాము. ఇంకా అనేక వస్తువులుకూడ నశించుట చూస్తూవున్నాము. జెకోస్లావేకియా, హాలండు, పోలండు, ఫ్రాన్సులు పోవుట చూచాము. జమీందారీసమాజము పోయింది. పెట్టుబడిదారిసమాజమే వచ్చింది. ఇది పోయి సోషలిస్టుసమాజము రష్యాలో వచ్చింది.

పై సూత్రాన్ని పరిశీలించుటకు వడ్లగింజను ఉదాహరణగా తీసుకొందాం. వడ్లగింజలోనే దానివ్యతిరేకపు మొక్క ఉన్నది. మొక్క వడ్లగింజలో ముక్కు రూపములో ఉంది (ఆముక్కు పోతే వడ్లగింజ మొలవదు). వడ్లగింజను మొలవవేస్తే మొక్క అవుతుంది. గింజ నాశనమయిపోతుంది. మొక్క పెరుగుతుంది. దుబ్బు చేస్తుంది. కంకులు వేస్తుంది. మొక్క చస్తుంది. వరిగింజలో ఎలా వరిమొక్కఅంకుర మున్నదో అలాగే వరిమొక్కలోనే వరిమొక్క వ్యతిరేకమైన వరిగింజల అంకుర మున్నది. మనము ఒకవరిగింజను మొలవవేశామంటే దానికి వ్యతిరేకం జరిగింది. ఇది మొదటివ్యతిరేకము. మొక్కకు వ్యతిరేకం జరిగి వరికంకులు వచ్చినాయి. ఇది రెండవవ్యతిరేకం. ఒక వరిగింజదగ్గర ప్రారంభించి వ్యతిరేకమునకు వ్యతిరేకము చేసి చాల వడ్లగింజలు సంపాదించాము. మనము ఒకవరిగింజదగ్గర ప్రారంభించి, మరల ఒకవరిగింజనే సంపాదించలేదు. ప్రారంభించిన

చోటుకే రాలేదు. అనగా ప్రపంచము గుండ్రని సున్నాలో తిరుగుట లేదు. స్ప్రింగు మాదిరిగా అభివృద్ధిచెందుచున్నది.

స్త్రీ పురుషుల ఉదాహరణ తీసుకొందాం. స్త్రీపురుషులలో పిల్లలకు కారణమైన ఇంద్రియాలు ఉన్నవి. స్త్రీపురుషులకు ఇంద్రియం వ్యతిరేకం. ఇది మొదటివ్యతిరేకం. ఈ ఇంద్రియముల కలయికవలన పిల్లలు పుట్టుచున్నారు. ఈ ఇంద్రియముల కలయిక జరిగినప్పుడు వీనికి వ్యతిరేకము జరుగుచున్నదన్నమాట. ఇది రెండవవ్యతిరేకము. ఒకస్త్రీ, పురుషునిదగ్గరనుండి ప్రారంభించి వ్యతిరేకానికి వ్యతిరేకము జరిగి ఎక్కువమంది స్త్రీ పురుషులు పుట్టుచున్నారు.

మరొకఉదాహరణ:—సీతాకోకచిలుక గ్రుడ్లలోనుండి సీతాకోకచిలుకపిల్లలు వస్తాయి. వయస్సు వచ్చినతరువాత ఆడమగ సీతాకోకచిలుకలు కలుస్తాయి. గ్రుడ్లుపెట్టిన తరువాతనే అవి చనిపోతాయి. రెండు గుడ్లదగ్గర ప్రారంభించి వ్యతిరేకానికి వ్యతిరేకము జరిగి అనేక గుడ్డులు వచ్చినాయి. ఇలాగే ఇతరజీవకోటిలో అనేకఉదాహరణలు చూపించవచ్చును.

భూశాస్త్రము (geology) లో పైసూత్రాన్ననుసరించి అనేకఉదాహరణ లున్నవి. వర్షము, వాయువు, ఎండ మొదలగువానివలన కొండలు శిథిలమై సముద్రములోనికి కొట్టుకుపోయి, సముద్రములో పేరుకొని, అక్కడకూడ కొండలు పుట్టుతూ ఉంటాయని భూశాస్త్రం చెబుతుంది. మొదట కొండలు వ్యతిరేకము చేయబడి సముద్రముమధ్య పేరుకొన్నవి. తర్వాత దానికి వ్యతిరేకము చేయబడి సముద్రముమధ్యనుండి కొండలు



లేచినాయి. ఇలాగే పూర్వం దక్షిణహిందూదేశం ఆఫ్రికాఖండానికి కలుపబడియుండేదట! దక్షిణహిందూదేశానికి ఉత్తర హిందూదేశానికి మధ్య సముద్ర ముండేదట! ఇప్పుడు దక్షిణ హిందూదేశము ఉత్తరహిందూదేశము కలిసియున్నవి. ఆఫ్రికా దక్షిణ హిందూదేశములు వేరుఅయినాయి.

మరొకఉదాహరణ-మొదట మానవసమాజంలో వర్గాలు లేవు; అణచే వారు, అణవబడేవారు లేరు. అంతా సమిష్టిగా కష్టించి సమిష్టిగా అనుభవించేవారు. దీనినే ఆదిమకమ్యూనిస్టు సమాజ మందురు. అటుతర్వాత దీనికి వ్యతిరేకమైన, వర్గాలున్న, కష్టించేవారు కష్టించనివారు ఉన్న, బానిస, జమిందారీ, పెట్టుబడిదారీ సమాజాలు వచ్చినాయి. ఇప్పుడు వర్గాలు లేని సోషలిస్టు సమాజం సోవియటురష్యాలో వచ్చింది.

ఆదిమకమ్యూనిస్టుసమాజము, తరువాత వర్గసమాజాలు, అటుతర్వాత మరల ఉన్నత కమ్యూనిస్టుసమాజము రానున్నవి.

మరొకఉదాహరణ. ఆదిమ కమ్యూనిస్టు సమాజములో భౌతికవాదమే యుండేది. దేవునిమీద నమ్మక ముండేది గాదు. అటుతర్వాత సమాజాలలో ఆత్మ శరీరము వేరు, ఆత్మ నాశనము లేనిదనీ, శరీరమునకు మూలమను భావము వర్గసమాజములలో వచ్చింది. ఇప్పుడు ఆదిమ కమ్యూనిస్టు సమాజములోని స్వాభావికమైన భౌతికవాదముకన్న అభివృద్ధిచెందిన భౌతికవాదము వస్తున్నది.



## అధ్యాయము 4

# చారిత్రాత్మిక భౌతికవాదము

## (Historical Materialism)

క్రిందటి అధ్యాయములో గతితార్కిక భౌతికవాదాన్ని గూర్చి వ్రాశాను. గతితార్కిక భౌతికవాదం మొత్తముమీద ప్రపంచమంతా ఎలా మార్పు జెందుచున్నదో తెలుపుచున్నది. ఆ వాదమును మొత్తములో ఒకభాగమైన మానవసమాజము యొక్క పరిణామము అనగా చరిత్రకు అన్వయించి, తేల్చిన సారాంశమే చరిత్రాత్మిక భౌతికవాదము. మార్క్సు తనకుటుంబముయొక్క సౌఖ్యమునుగూడ ధారబోసి కటికదారిద్ర్యాన్ని అనుభవించి చారిత్రాత్మిక భౌతికవాద సూత్రాలను కనిపెట్టాడు. మార్క్సుయొక్క గొప్పదనము దీనిలోనే యున్నది. అంతవరకూ చరిత్రకు కారణం చరిత్రలోని ప్రముఖవ్యక్తులే నని భావవాదులు వాదించేవారు. అనగా వారిప్రకారం రష్యాలో మార్పుకు కారకుడు లెనిన్, అక్కడి నిరుద్యోగము, ఆకలిమంట బానిసత్వం గాదు. మార్క్సువాదం ప్రకారం అక్కడిపరిస్థితులు లెనిన్‌వంటి గొప్పవ్యక్తిని సృష్టించినాయి. అంతమాత్రాన లెనిన్‌యొక్క ప్రాముఖ్యము లేదనిగాదు. లెనిన్ ఉద్యమాన్ని చక్కని త్రోవన నడిపి జయం బొందించాడు. ఉద్యమాన్ని జయం బొందించడములోనే అతనిగొప్పదన మున్నది. అలాగే మనదేశములో 1921, 1930-32 లో సత్యాగ్రహోద్యమాలకు కారణం గాంధీగారు కాదు. 1921 లో యుద్ధంతరువాత వచ్చిన



ఆర్థికమాంద్యం, 1930-31 లో ప్రపంచాన్ని ఆవరించిన ఆర్థిక మాంద్యములే ఆఉద్యమాలకు కారణం. ఆ పరిస్థితులు గాంధియంత గొప్పవ్యక్తిని పుట్టించినాయి. అతడు ఉద్యమాన్ని నిర్మాణరూపంలో పెట్టి నడిపాడు.

మార్క్సు 'ఆర్థికశాస్త్రముయొక్క విమర్శ' అను గ్రంథములో ఈ విధంగా వ్రాశాడు. "మానవులు సమాజమునకు కావలసినవస్తువుల నుత్పత్తిచేయుటకుగాను, తప్పనిసరియైన వారిఇష్టముమీద ఆధారపడని స్పష్టమైన సంబంధాలను ఏర్పరచుకొంటారు; ఈఉత్పత్తిసంబంధాలు, ఉత్పత్తిశక్తులు (పనిముట్లు, పనిచేయుమనుష్యులు) అభివృద్ధిలో ఒకస్పష్టమైన దశకు చెంది ఉంటాయి. ఉత్పత్తిసంబంధాల ఈమొత్తమే సమాజముయొక్క ఆర్థిక నిర్మాణము. ఈ ఆర్థికనిర్మాణమే సమాజముయొక్క నిజమైనపునాది. ఈ పునాదిమీదనే న్యాయశాస్త్రము (చట్టములు) రాజకీయఅంతస్తు (ప్రభుత్వయంత్రము, రాజకీయపార్టీలు) లేస్తాయి; ఆ పునాదికిసంబంధించియే స్పష్టమైన సామాజిక చైతన్యము (నీతిసూత్రములు, మతము, వేదాంతము, విజ్ఞానము, సంగీతము, సాహిత్యము, శిల్పము మొదలగుకళలు) ఉండును."

పై దానినే మార్క్సు క్లుప్తీకరించి ఈక్రిందివిధముగా చెప్పాడు. "సామాజికావసరాలను ఉత్పత్తిచేయుపద్ధతి సామాజిక, రాజకీయ, మానసిక సంబంధమైన మానవజీవితగతులను నిర్ణయిస్తుంది. మానవజీవితాన్ని నిర్ణయించేది వారిచైతన్యము గాదు. వారిసామాజికవిధానమే వారిచైతన్యమును నిర్ణయిస్తుంది.

సామాజికావసరాలను ఉత్పత్తిచేయుపద్ధతి సామాజిక, రాజకీయ, మానసికసంబంధమైన గతులను నిర్ణయిస్తుందని చెప్పినంతమాత్రాన వానిలో ఒకదానిమీద మరొకదాని ప్రభావ ముండదని గాదు. ఒకదానిమీద మరొకదానిప్రభావము తప్పకుండా ఉంటుంది. కాని అవి ముఖ్యముగా ఉత్పత్తి పద్ధతిమీద ఆధారపడిఉంటాయి. దీనినిగూర్చి మార్క్సు సహకారియైన, మార్క్సుసుఖదుఃఖములను పంచుకొని మార్క్సు సిద్ధాంతముల నభివృద్ధిజేసిన ఏంగెల్సు ఈవిధంగా వ్రాశాడు. ఈ సామాజికగతులలో (elenients) (సామాజిక, రాజకీయ, మానసికగతులు) ఒకదానిమీద మరొకదానిప్రభావం పడుతుంది. ఈ ఘటనలలో ఆర్థికగతి (అనగా ఉత్పత్తిపద్ధతి చివరకు దానంతటఅదే బయటబడి ప్రాముఖ్యం వహిస్తుంది.

పైన జెప్పబడిన సూత్రములోని భాగములను విడివిడిగా ఆలోచించుదాము. దానిలోని మొదటిభాగము "మానవులు సమాజమునకు కావలసిన వస్తువుల ఉత్పత్తి చేయుటకుగాను తప్పనిసరియైన, వారియిష్టముమీద ఆధారపడని సంబంధాలను ఏర్పరచుకొంటారు. ఈ ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలో ఒకస్పష్టమైన దశకు చెందిఉంటాయి." ఉత్పత్తిశక్తు లనగా జీవితావసరాలకు కావలసినవస్తువులు తయారుచేయబడుటకు కారణమైన శక్తులు (1) పనిముట్లు (2) పనిచేయు వ్యక్తులు. అయితే మనము కొంచెం లోతుగా పరిశీలించితే పనిచేయువ్యక్తుల దశ పనిముట్లమీద ఆధారపడి యుంటుందని ఊహించవచ్చును. ప్రస్తుతమున్న పెట్టుబడిదారి సమాజములో



కార్మికులు అనగా యంత్రముల (వాటంతట అవి తిరిగేపనిముట్లు) మీద పనిజేయువా రున్నారంటే ముందు యంత్రము లుండాలి. కనుక ఉత్పత్తిసంబంధాలు ఉపయోగించే పనిముట్లమీద ఆధారపడి యుంటా యని మనము నిస్సందేహముగా చెప్పవచ్చును. కనుక సమాజములోని ప్రతిఘటనకూ మూలకారణము ఆసమాజములో అప్పుడు ఉపయోగించే పనిముట్లే నని చెప్పవచ్చును. అయితే మానవులు ఆ పనిముట్లమీద పనిచేయునప్పుడు తప్పనిసరియైన కొన్నిసంబంధాలను, వారి కిష్టము లేకపోయినప్పటికీ ఏర్పరచుకొంటారు. వానినే ఉత్పత్తి సంబంధా లందురు. ప్రస్తుతమున్న పెట్టుబడిదారి సమాజాన్ని ఉదాహరణగా తీసుకొందాము. కార్మికునకూ పెట్టుబడిదారునకూ ఉండేసంబంధ మేమనగా పెట్టుబడిదారునకు యంత్రములు సొంతఆస్తి. అతడు కాయకష్టపడడు. తమరెక్కలుతప్ప మరేమీ సొంతఆస్తిలేని కార్మికుల వద్దనుండి శ్రమశక్తిని (పనిజేయగల శక్తిని) కొని లాభాలు తీస్తాడు. రెండవసంబంధం పెట్టుబడిదార్లకూ, పెట్టుబడిదార్లకు మధ్య ఉండేసంబంధం. పరిశ్రమలను సాగించడానికి, వారికి ముడిసరకులను కొనుటకు, తయారైన సరకుల నమ్ముటకూ, స్టాక్ ఎక్స్చేంజి మార్కెట్లు (stock exchanqe Market) మొదలగునవి వచ్చినాయి. మార్కెట్టులో ఒకరికన్న మరొకరు ఎక్కువ లాభం సంపాదించుకొనుటకు పోటీలుబడుతూ ఉంటారు. ఫ్యాక్టరీలు నడుపుటకు ధనంకావాలి. అందువలన బ్యాంకులు వచ్చినాయి. ఈ విధముగానే ధనము మార్కెటు, షేరు మార్కెటు మొదలగున వెన్నియో వచ్చినవి. కార్మికులు తమ

తమ జీవితపరిమాణాన్ని కాపాడుకొనుటకు కార్మికసంఘాలు పెట్టుకొంటారు. ఈసంబంధాలేగాక కార్మికులు, పెట్టుబడిదార్ల మధ్య; కార్మికులు, కార్మికులమధ్య; పెట్టుబడిదార్లు, పెట్టుబడిదార్లమధ్య: అనేక ఉత్పత్తిసంబంధాలున్నవి. ఇటువంటి పెద్ద పెద్ద యంత్రాలు లేకపోతే కార్మిక పెట్టుబడిదారు వర్గాలను పరస్పరవిరుద్ధవర్గాలు వచ్చియుండేవేనా? ఒక్కొక్క కార్మికుడు ఒక్కొక్కయంత్రాన్ని కొని, తనఇంట్లోపెట్టుకొని తానొక్కడే పనిచేయగలడా? ఒక్కొక్క యంత్రాన్ని కదుపుటకు అనేక వందలమంది కావాలిగదా! చిన్నచిన్న చేతిపనిముట్లతో ఎవరంతట వారు పనిచేసుకొనే జమీందారీ సమాజములో, కార్మికులు, పెట్టుబడిదార్లు అను ప్రత్యేక వర్గాలు ఉండుట కవకాశమున్నదా? స్టాకు ఎక్సు ఛేంజిలు, షేరుమార్కెట్లు, బ్యాంకులు ఉండుట కవకాశమున్నదా? పెట్టుబడిదారు సమాజములోనే, అనగా యంత్రము లున్నప్పుడే పై జెప్పిన కార్మిక పెట్టుబడిదారువర్గాలు, బ్యాంకులు, స్టాకుఎక్సుఛేంజిలు కార్మిక యూనియనులు, మిల్లు యజమానుల యూనియనులు ఉండుట కవకాశమున్నదని అందరికి విదితమగుచున్నది. సమాజమునకు పునాదియైన ఆర్థిక నిర్మాణము అనగా మొత్తము ఉత్పత్తి సంబంధాలు, ఆసమాజములో ఉత్పత్తికి ఉపయోగించే పనిముట్లమీద ఆధారపడియుండును.

పై సూత్రములో తరువాత భాగమునుగూర్చి ఆలోచించుదాము. "ఉత్పత్తి సంబంధాల మొత్తమే సమాజముయొక్క ఆర్థికనిర్మాణము; ఈఆర్థికనిర్మాణమే సమాజముయొక్క నిజమైన



పునాది; ఈపునాది మీదనే న్యాయశాస్త్ర రాజకీయ అంతస్థులు లేస్తాయి." మార్క్సు సమాజాన్ని ఇంటికినీ, ఉత్పత్తిసంబంధాలను ఇంటిపునాదికినీ, న్యాయశాస్త్రము, రాజకీయములు (ప్రభుత్వము, రాజకీయపార్టీలు) గోడలు, దూలములు మొదలగువానికినీ పోల్చాడు. పై జెప్పినదానికి ఉదాహరణగా పెట్టుబడిదారు సమాజమును తీసుకొందాము. ఈసమాజములో యంత్రాలు అన్నీ పెట్టుబడిదార్ల చేతుల్లో ఉన్నవి. వారు వానిని ఉపయోగించి కార్మికులను బానిసలుగా జేశారు. వారి కనుకూలమైన చట్టాలను జేసుకొన్నారు. చెమటోడ్చి ఉత్పత్తిజేయు కార్మికుల నోళ్ళుగొట్టి వారిధనాన్ని పోగుజేయుట చట్టసమ్మతమేకాని, కార్మికులు న్యాయమైన కూలికొరకు పోరాడటం చట్టవిరుద్ధము. పెట్టుబడిదార్ల ఆస్తిని ఎవరైనా ఎత్తుకుపోవడం దొంగతనం; చట్టవిరుద్ధం; జైలుప్రాప్తి అవుతుంది. అయితే కూలివాడి ఆస్తిని ఎత్తుకుపోవటంగూడ చట్టవిరుద్ధమేగదా! అని అడుగవచ్చు. కూలివాడికి ఏమున్నది, ఎత్తుకుపోవడానికి? ఈ పెట్టుబడిదారు సమాజాన్ని కాపాడుటకు ఏర్పరుపబడినది ప్రస్తుతప్రభుత్వం. (ప్రభుత్వమనగా కోర్టులు, జెయిళ్ళు, పోలీసులు, మిలిటరీ, శాసనసభలు మొదలగునవి. కార్మికులు సమ్మెలుచేస్తే పోలీసు లాఠీఛార్జి చేస్తుంది. వీరిచేతగాకపోతే మిలిటరీ సహాయము జేస్తుంది. ముఖ్యమైనవారిని అరెస్టుజేస్తుంది. కోర్టులు శిక్షలు వేస్తాయి. జైళ్లలో పెడుతుంది. పెట్టుబడిదారి విధానమునకు ఏకొంచెము దెబ్బతగిలినా ప్రభుత్వముయొక్క వివిధభాగములు ఎలాపనిజేస్తాయో చూడండి.

ప్రస్తుతం మనదేశములో ఉన్నది బ్రిటిషు పెట్టుబడిదారు ప్రభుత్వం. కనుక సామాన్యప్రజనేకాక మనదేశపెట్టుబడిదార్లను గూడ అణచుతుంది. 1921, 1930-31 సత్యాగ్రహోద్యమాలు దీనికి తార్కాణములు. ఇప్పుడు అదనపు లాభాల పన్ను వేయుట, మనదేశములో మోటార్లు, ఫ్యాక్టరీలు, స్టీమర్లు కట్టుకోన నిరాకరించుట మొదలగున వెన్నియో బ్రిటిషు షాహుకారువర్గం చేస్తున్నది.

ఇంక పై సూత్రములో మూడవభాగమునుగూర్చి ఆలోచించుదాం—"ఆ పునాదికి సంబంధించియే స్పష్టమైన సామాజిక చైతన్యముగూడ ఉంటుంది." చైతన్యమునకు స్థూలరూపము లేదు. అది మనుష్యుల మెదడునకు సంబంధించినది. సామాజిక చైతన్య మనగా నీతిసూత్రములు, మతము, వేదాంతము, విజ్ఞానము, సంగీతము, సాహిత్యము, శిల్పము మొదలగు కళలు. పెట్టుబడిదారు సమాజపు నీతిసూత్రాలలో ముఖ్యమైనది "ఒకరిసొత్తును అపహరించగూడదు." ఈసూత్రము పెట్టుబడిదారి విధానాన్ని కాపాడుట కెంతయో వినియోగించుచున్నది. పెట్టుబడిదారి వేదాంతం ఏమిచెబుతుంది? సృష్టిలో అందరూ సమానులుగా పుట్టలేదనీ, కొంతమంది కాయకష్టముచేయుటకు మరికొందరు మెదడుతో పనిచేయుటకు దేవునిచే నిర్మింపబడినారనీ, అనాదినుండీ ఈభేదం వస్తూఉందనీ, దీనినతిక్రమించితే ప్రపంచం నాశనమవుతుందనీ, దేవుడు శిక్షిస్తాడనీ, కలిమిలేములు కావడికుండలనీ చెబుతుంది. దీనినే పెట్టుబడిదారివర్గానికి చెందిన మతాధిపతులు ప్రచారంజేస్తూ ఉంటారు. నల్లజాతులు సృష్టి



లోనే తక్కువజాతులనీ, వారిని నాగరకవంతం జెయ్యడం తెల్లజాతుల దైవీకృతవిధి అనీ బ్రిటిషు పెట్టుబడిదారి విధానమునకు చెందిన మతాధికారులు మనదేశములో ప్రచారం చేయడంలేదా!

విజ్ఞానం:— ప్రస్తుతం శాస్త్రం (science) పెట్టుబడిదార్లకు లాభమున్నంతవరకే అభివృద్ధి బొందుతుంది. లాభాలు వచ్చినంతకాలమూ ధనసహాయముజేసి శాస్త్రాన్ని పెట్టుబడిదార్లు అభివృద్ధిజేసారు. ఇప్పుడు ఆర్థికమాంద్యం రావడం, ధరలు పడిపోవడం, లాభాలు రాకపోవడంచేత శాస్త్రముయొక్క అభివృద్ధిని అరికడుతున్నారు. క్రొత్తవిషయములు ఏశాస్త్రవేత్త అయినా కనిపెడితే వానిని ప్రజోపయోగమునకు పనికిరానియ్యడంలేదు. అమెరికాలో కనిపెట్టబడిన ఆధునికయంత్రాలు అమెరికాలో ఉపయోగింపబడుటలేదు. పెట్టుబడిదారివిధ్యావిధానము సంగతి యోచించుదాము. పెట్టుబడిదారి విధానమునకు పనికివచ్చు విద్యయే నేర్పబడుతుంది. పెట్టుబడిదారి సిద్ధాంతానికి విరుద్ధమైన మార్క్సుసిద్ధాంతాన్ని ప్రస్తుతవిద్యాలయాల గేటులవద్దకైన రానీయరు. వార్తాపత్రికలసంగతిగూడ అంతే. పెట్టుబడిదారి విధానానికి అనుకూలించిన వార్తలే ప్రకటించబడుతాయి. వార్తలు అనుకూలించేటట్టు మార్చబడి అబద్ధపు వ్రాతలు వ్రాయబడుచుండుట మీ కెరిగినదే. వార్తాపత్రికలకు పెట్టుబడిదార్లు ధనసహాయముజేసి లోబరచు కొంటారు. అథవా ఏదైనా వార్తా పత్రిక పెట్టుబడిదారి విధానాన్ని విమర్శించి, నిజమును వెల్లడించితే దారుణంగా అణచివేయబడుతుంది.

ప్రస్తుతసంగీతమూ, శిల్పమూ, సాహిత్యము మొదలగు కళలకు సంబంధించినవారు పెట్టుబడిదార్ల అండనే జీవించు చున్నారు. కనుక తమచేతలలో వారు పెట్టుబడిదారువిధా నాన్నే పొగడుతూ ఉంటారు.

అయితే పెట్టుబడిదారి నీతి, విజ్ఞానము, వేదాంతము, కళలపక్కనే కార్మికవర్గానికి జెందిన మార్క్సిస్టునీతి, విజ్ఞానము, కళలు అభివృద్ధి జెందుచునే యున్నవి. భవిష్యత్తులో ఇవి ప్రాధాన్యం వహిస్తాయి, కాని పెట్టుబడివారిసీతి, విజ్ఞానము, కళలు పెట్టుబడిదారిసమాజములో ప్రాధాన్యం వహించుతాయి.



అధ్యాయము 5

# మానవ సమాజాభివృద్ధిలో వివిధదశలు.

క్రిందటి అధ్యాయములో ప్రస్తుతము పెట్టుబడిదారు సమాజములో ఉపయోగించు ఉత్పత్తిసాధనాల (యంత్రాల) మీద ఆ సమాజ ఆర్థికవిధానము, ప్రభుత్వము, రాజకీయ పార్టీలు, మతము, వేదాంతము మొదలగునవన్నీ ఎలా ఆధార పడిఉన్నాయో వివరించబడినది. అలాగే మానవసమాజాభి వృద్ధిలో వివిధదశలలో ఉన్న ఆర్థిక, రాజకీయ, మానసిక సం బంధమైన విషయములన్నీ, వివిధదశలలో ఉపయోగింపబడే ఉత్పత్తిసాధనాలమీద ఆధారపడిఉన్నవి. సమాజాభివృద్ధిలో వివిధదశలను వివిధసమాజా లని వాడవచ్చును. (1) ఆదిమ కమ్యూనిస్టుసమాజము (2) మాతృస్వామికసమాజము (3) పితృ స్వామికసమాజము (4) బానిససమాజము (5) జమిందారి సమాజము (6) పెట్టుబడిదారుసమాజము అను ఆరుసమాజా లుగా ఇంతవరకూ జరిగిన చరిత్రను విభజింపవచ్చును. ఒక సమాజము మరొకసమాజములోనికి ఎలా మారినది క్రింద వివరింపబడును.

1. ఆదిమకమ్యూనిస్టు సమాజము:—మొట్టమొదట మానవులు చిన్నచిన్న ముఠాలుగా అడవులలో తిరుగుచూ పండ్లు, కాయలు, దుంపలు, అడవిజంతువులను వేటాడి వాని పచ్చిమాంసమును తిని జీవించుచుండేవారు. అప్పటికి నిప్పు

యొక్క ఉపయోగము నింకా మానవుడు తెలుసుకోలేదు. కనుక మాంసమును వండి తినుట అప్పటికి లేదు. ముఠాలోని స్త్రీ, పురుషులు అందరు వేటాడేవారు. వేటలో చంపినజంతువుల మాంసము అందరు భుజించేవారు. అప్పటికి స్త్రీపురుషులకు వేరువేరుపనులు లేవు. స్త్రీలకు పిల్లలను కాపాడుటమాత్రము ఉండేది. స్త్రీపురుషులు సమానస్వతంత్రం కలిగియుండేవారు. ఒకరు ఎక్కువ, మరొకరు తక్కువ అనేదే ఉండేది గాదు. అంతా సమానులే. వర్గభేదాలు లేవు. ధనవంతులు, బీదలు లేరు. ప్రభుత్వం లేదు. పోలీసు లేదు. అణవబడేవారు, అణచేవారు అను వర్గాలు లేవు. వారికి ఇండ్లు, వాకిండ్లు లేవు. స్థిరనివాసం లేదు. చెట్లు, కొండగుహలలో నివసించేవారు. ఒకచోట పండ్లు, ఫలాలు, వేటజంతువులు దొరకక పోతే, మరొకచోటికి చేరేవారు. అందరు సమష్టిగా కష్టించి, అందరు సమష్టిగా అనుభవించేవారు. అందువలననే ఈసమాజము ఆదిమకమ్యూనిస్టుసమాజ మనబడినది.

పైజెప్పినవిధంగా అప్పుడు మానవులు ఎందుకు జీవించారు? ఇప్పటివలె వర్గభేదాలు ఎందుకు లేవు? యుద్ధాలెందుకు లేవు? మనకన్నా అప్పటిమానవులు మంచివారగుటచేతనా? కాదు. మార్క్సు చెప్పినట్లుగా ఆసమాజములో జీవితావసరాలను గడుపుకొనుటకు ఉపయోగించిన పనిముట్లే ఆ రకంగా మానవులు జీవించుటకు కారణము. (ఆదిమకమ్యూనిస్టు సమాజములో) మానవులు ఉపయోగించిన పనిముట్లెవ్వి? అప్పటికి మానవులలో విజ్ఞానము లేదు. కోతులకన్న కొంచెము ఉన్నత



దశలో మానవుల తెలివితేటలు ఉండేవి. ఆ దశకు తగియే వారి పనిముట్లు ఉండేవి. కర్రలు, లావాటి గదలలాటి పొట్టికర్రలు, మనుష్యుల ఇతరపెద్దజంతువుల బొమికలు, రాళ్లు మొదలగు ప్రకృతిలో సామాన్యముగా లభించే ఆయుధాలు ఉపయోగింపబడేవి. పులులు, ఏనుగులు, మొదలగు జంతువులనుండి తమ్ము తాము రక్షించుకోవాలన్నా, పైజెప్పిన ఆయుధాలతో అడవిజంతువులను వేటాడాలన్నా, ముఠాలుగా ఉండాలి. లేకపోతే అడవిజంతువులనోళ్ళలో బడటము జరుగుతుంది. ఆజంతువులను ఒక్కరొక్కరే ఆ ఆయుధములతో వేటాడుట సాధ్యము గాదు. జంతువులు వీరున్నచోటికి రావు, వీరు జంతువు లున్నచోటికి పోవాలి. కనుక స్థిరనివాసాలు ఏర్పరుచుకొనుటకు వీలు లేదు. నిప్పుయొక్క ఉపయోగము కనుపెట్టబడలేదు. గనుక స్త్రీలకు పురుషులకు పనియొక్క విభజన కలుగలేదు. స్త్రీపురుషులొకేపని చేసేవారు. కనుక స్త్రీపురుషులు సమానస్వాతంత్ర్యం కలిగిఉండేవారు. ఏరోజున సంపాదించిన ఆహారపదార్థాలు ఆరోజుకే సరిపోయేవి. కాన వ్యక్తిఆస్తి లేదు, వర్గాలు లేవు, వర్గపోరాటం లేదు. వర్గపోరాటము లేనప్పుడు ఒక వర్గాన్ని మరొకవర్గం అణచవలసినపని లేదు. అందువలన ఇతరవర్గాలను అణచుటకు వర్గయంత్రమైన ప్రభుత్వఅవసరం లేకపోయింది. ఎవరూ కూర్చొని తినటానికి అవకాశం లేదు. అందరూ కష్టపడాలిసిందే, సమిష్టిగా అనుభవించాలిసిందే. ఒక చిన్నముఠా కలిసి వేటాడడం, పండ్లుఫలాదులు పోగుచేయడమే గనుక ఆర్థికవిధానం క్లిష్టమయిందిగాదు. ఆర్థికవిధానాన్ని నడపుటకు కాయ

కష్టముపడనివారొకరు ఉండాలిసినఅవసరం ఉండేదిగాదు. అందు
వలన ఆముఠాలలో ముఠాపెద్ద లెవ్వరూ ఉండేవారు కాదు.
మానవులు బాహ్యప్రపంచములోని వస్తువుల నాధారముగా
జేసుకొనియే ఆలోచించుతారు. మెదడుపని జేసేవారు, కాయ
కష్టముపడేవా రనేభేదా లెప్పుడైతే సమాజములో లేవో,
ఆదిమకమ్యూనిస్టు సమాజములోని మానవులలో ఈ సృష్టి
నంతా నడిపేదేవు డొక డెక్కడో యున్నా డనేభావం పుట్ట
లేదు. అందువలన స్వాభావికమైన విజ్ఞానముతో సంబంధము
లేని భౌతికవాదము ఉండేది. అప్పటిభౌతికవాదము ఈరోజు
ల్లోని మార్క్సుయొక్క భౌతికవాదమువలె విజ్ఞానము శాస్త్ర
మువలన తెలుసుకోబడిన భౌతికవాదం గాదు. కాని ఉరుము
మెరుపు, సూర్యుడు, చంద్రుడు మొదలగువానినిగూర్చి ఏమీ
తెలిసేదిగాదు. జంతువులు ఉరుము, మెరుపుల కెట్లా భయపడు
చుండేవో మానవులుగూడా అట్లే భయపడుచుండేవారు.
వీ టన్నిటివెనుక ఏదో మహాశక్తి ఉన్నదనేఊహాయే ఉండేది
గాదు. ఏముఠా సంపాదించినఆహారపదార్థాలు ఆముఠాకే సరి
పోయేవి. అన్నిముఠాలు సంపాదించేవస్తువులు ఒకటే కనుక
వస్తువులమార్పిడి ఉండేదిగాదు. కనుక ఒకముఠాకు మరొక
ముఠాకు ఆర్థికంగా సంబంధ ముంచుకోవలసిన అవసర ముండేది
గాదు. అందువలన ఏముఠాలోనిస్త్రీలతో ఆముఠాలోని పురు
షులే సంభోగించి కామం తీర్చుకొనేవారు. ముఠాలు చిన్నిచిన్ని
విగా ఉండుటవలన అన్న చెల్లెలు, తండ్రి కూతురు, తల్లి కుమా
రుడు అనే భేద ముండేదిగాదు. ఒకముఠాలోని స్త్రీలంతా



ఆముఠాలోని పురుషు లందరిభార్య లన్నమాట. ఆ రోజుల్లో
ఆ రకంగా సంభోగించుటయే నీతి అన్నమాట. మానవునికి ఎంత
ఇష్టము లేకపోయినా ఆ రకమయిన సంభోగము చేయకుండా
ఉండుట కవకాశ మున్నదా? కనుక నీతిసూత్రా లనేవిగూడా
ఆ కాలములో ఉత్పత్తికి ఉపయోగించే పనిముట్లమీదనే ఆధార
పడి ఉంటాయి. నీతి సూత్రాలుగూడా తాత్కాలికములే.
ముఠా పెరగగానే మరల చిన్నిముఠాలుగా చీలేవి. కారణం అప్పటి
జీవితవిధానం (వేట, పండు, ఫలాలు) పెద్దపెద్దముఠాలుగా
ఉండేదానికన్న చిన్నచిన్నముఠాలుగాఉంటే ఎక్కువ సంపాదింప
కలుగుతారు. వేట, పండ్లు, ఫలాలు ప్రోగుజేయుటకు అంత
కన్నా పెద్దముఠాలు అవసరం లేకపొయ్యేది. చిన్నిచిన్ని
ముఠాలుగా చీలుటగూడ అప్పుడు జీవితావసరాలకు ఉప
యోగించే పనిముట్లమూలముననే.

**మాతృస్వామిక సమాజము:**— మాత అనగా తల్లి,
స్వామ్య మనగా పెత్తనము. కనుక మాతృస్వామిక సమాజ
మనగా తల్లి పెత్తనం సాగే సమాజం. ఉత్పత్తిసాధనాలు అభి
వృద్ధిచెందుతూనే ఉన్నాయి. చెట్లు కొమ్మకొమ్మ రాచుకొని
అగ్ని బుట్టి అడవులు తగులబడుట, అందులో కొన్ని కాయలు
వేగి మంచివాసన వచ్చుట, కొన్నిజంతువులుకూడ కాలి ఉండుట
ఆదిమనివాసుడు కనిపెట్టాడు. ఆ వేగినకాయలను, కాలినజంతువు
లను రుచిచూచి యుండవలెను. అప్పుడు నిప్పుయొక్క ఉపయో
గమును, చేసేవిధమును తెలిసికొనిఉండాలి. ఆదిమనివాసులు పుల్ల
పుల్ల రాచి నిప్పు తెప్పించేవారు. నిప్పులతో దుంపలు, కాయలు

కాల్చి తినడం నేర్చుకొన్నారు. కొయ్యపాత్రలను చేయుట నేర్చుకొన్నారు. అవి నిప్పుమీద బెట్టినప్పుడు కాలిపోకుండా మట్టిని పూసేవారు. కొన్నిరోజులకు మట్టితోనే పాత్రలను జేసి ఎండబెట్టి ఉపయోగించడం నేర్చుకొన్నారు. మరికొంతకాలానికి మట్టిపాత్ర కాల్చితే ఉండేగట్టితనాన్ని తెలుసుకొన్నారు. కుండలు చేసి కాల్చడం నేర్చుకోబడింది. దీనిలో నీళ్లతో ఉడకబెట్టి తినడంగూడా నేర్చుకొన్నారు. రాళ్లు చెక్కి రాతిగొడ్డలి చేయడం నేర్చుకొన్నారు. కొయ్యాగసికలు చెక్కడం నేర్చుకొన్నారు. విల్లు, అంబు కనిపెట్టబడింది. దీనితో దూరాన్నుండి అడవిజంతువులను చంపడానికి వీలయింది. ఈ ఆయుధంతో అడవిజంతువులమీద కొంతవరకూ ఆధిక్యం మానవుడు సంపాదించాడు. వేటాడుట చాలా ఎక్కువయిపోయింది. చేపలు పట్టి ఉడకబెట్టి తింటే రుచిగా ఉంటుందని మానవుడు గ్రహించాడు. నిప్పును కనిపెట్టుట అంబు విల్లు కనిపెట్టుటతో స్త్రీపురుషులపనిలో భేదం కలిగింది. మొట్టమొదటి పనివిభజన స్త్రీపురుషులమధ్యనే. స్త్రీలు వంట వండుట, వంటపనిముట్లను జేసికొనుట, పిల్లలను పోషణజేయుట, వస్త్రాలను తయారుజేయుట, కుట్టుపని మొదలగు ఇంటిపని జేస్తూ ఉండేవారు; జంతువులను చేపలను వేటాడుట, ఇతర ముడివస్తువులను సంపాదించుట, వీనికి కావలసినఆయుధాలను జేసికొనుట పురుషులపని. ఎవరిపని జేసేపనిముట్లు వారివే, పై ఆయుధాల వలన కొంత అదనంగా ఆహారపదార్థాలను కూడబెట్టవచ్చును గాని, అంత ఎక్కువగా కాదు. అందువలన ఇంటిపనికి, బయటి పనికి విలువలో ఏమీభేద ముండేది గాదు. ఎప్పుడైతే స్త్రీలపని



పురుషులపని వేరుఅయిందో, వంటపాత్రలు మొదలగునవి ఉపయోగించడం నేర్చుకొన్నారో, అప్పుడు రాతిగొడ్డలితో చెట్లకొమ్మలునరికి కొద్ది గొప్పగా స్థిరమైన ఇండ్లు వేసుకోవలసివచ్చినది. పై ఆయుధాలు కనిపెట్టడంవలన ఉత్పత్తి హెచ్చింది. జనాభా హెచ్చింది. వేటాడేచోటుకొరకు ఒకముఠాతో మరొకముఠాకు దెబ్బలాటలు హెచ్చినాయి. అందువలన ఇదివరకువలె చిన్నచిన్న ముఠాలుగాగాక పెద్దపెద్ద ముఠాలుగా ఉండవలసిన అవసరం హెచ్చింది. చిన్నచిన్నముఠాలు పెద్దవై ఆదిమకమ్యూనిష్టు సమాజములోవలె చీలడం మానేసినాయి.

ఇంతపెద్దముఠాలు అయ్యేటప్పటికి ఆర్థికవిధానం కొంచెం క్లిష్టమయింది. ముఠాలోనివా రందరికిపనిజెప్పడానికీ, సమిష్టిగా సంపాదించినదానిని అందరికి పంచడానికీ ఒకమనిషి ప్రత్యేకంగా కావలసివచ్చాడు. దీనికి అందరికి నమ్మకమైన మనిషిని ముఠాలోనున్న స్త్రీపురుషులు ఎన్నుకొనేవారు. ఇతరముఠాలతో దెబ్బలాడి తమ వేటస్థలమును కాపాడుకొనుటకు, ఇతరులవి లాగుకొనుటకు, పోరాటాన్ని నడపడానికి ఒకనాయకుడు కావలసివచ్చాడు. పోరాటసమయములో నేర్పరియైన ఒకతాత్కాలిక నాయకుని ఎన్నుకొనేవాళ్లు. ఇప్పటివలె యుద్ధముచేయడానికి ప్రత్యేకసైన్య ముండేది గాదు. అప్పటి ఆర్థికవిధానం ఒక ప్రత్యేకసైన్యాన్ని కూర్చోబెట్టి మేపలేదు. ముఠాలోని మగవారంతా యుద్ధము జేసేవారు. ఓడిపోయిన ముఠాలోనివారిని తమ ముఠాలో కలుపుకొనుటయో లేక చంపివేయుటయో చేసేవాళ్లు. బానిసలనుగా చేయడానికి అప్పటి ఆర్థికవిధానంలో వీలు

లేదు. మానవుని శ్రమశక్తి ఆ పనిముట్లు ఉపయోగించి అత
నికి కావలసినదానికన్న ఎక్కువ ఉత్పత్తిచేయకలిగేది గాదు.
అందువలన బానిసలుగా జేసినా ఉపయోగంలేదు. క్రొత్తఆర్థిక
విధానముతోపాటు క్రొత్తనీతిసూత్రాలు వచ్చాయి. సమాజ
ములో కరువు వచ్చినప్పుడు ఉత్పత్తిలో పాల్గొనని ముదుసలు
లను, రోగులను చంపివేసేవారు. మనుష్యులను తినేవారు. మనం
ఇప్పటి పరిస్థితులనుబట్టి యోచించితే అది ఘోరంగా ఉంటుంది.
అప్పటి ఆర్థికవిధానాన్నిబట్టి వారు ఆపని చెయ్యకపోతే మానవ
సమాజమే నశించియుండేది. మనం ఈదశలో ఉండేవారమే
గాదు.

ముఠా పెద్దదవడంతో పూర్వంవలె పెద్దచిన్న భేదం
లేకుండా ముఠాలో ఇష్టమొచ్చినవారితో సంభోగించేపద్ధతి
పోయింది. మొట్టమొదట ముఠాలో తరాల (generations)
విభజన వచ్చింది. ముదుసలిపురుషులు ముసలిస్త్రీలతో సంభో
గించడం; వారికొడుకులు, కూతుళ్లు ఒకరితో మరొకరు సంభో
గించడం; వీరికూతుళ్లు కొడుకులు ఒకరితో మరొకరు సంభో
గించడం అనే ఆచారం వచ్చింది. అనగా అన్నాచెల్లెలు ఒకరితో
ఒకరు సంభోగించవచ్చు. ఇప్పుడు అమలులోనున్న కుటుంబపద్ధ
తికి పైవివరించినపద్ధతి మొదటి మెట్టుగా అయింది. ఆపద్ధతివలన
తలిదండ్రులు తమసంతానముతో సంభోగించుట ఆగిపోయింది.
ముఠాలు పెద్దవిఅవుటవలననే ఈపద్ధతికి వీలు కలిగిందని గ్రహిం
చాలి. ఈపద్ధతి ఇంకా మారింది. తరువాత అన్న చెల్లెలు ఒక
రితో మరొకరు సంభోగించకుండా ఉండేపద్ధతికూడా వచ్చింది.



మొదట ఒకతల్లికిపుట్టినవాళ్లు ఒకరితో మరొకరు సంభోగించ
కుండా ఉండటం; తరువాత అక్కచెల్లెండ్ల సంతానం ఒకరితో
ఒకరు సంభోగించకపోవడం; ఈవిధంగా దూరపు అక్కచెల్లెండ్ల
సంతానంతో సంభోగించకుండా ఉండటం మామూలైంది.అందు
వలననే ఒక్కొక్క పెద్దముఠాలో సొంతఅక్కచెల్లెండ్లు, అన్న
దమ్ములు, వారిసంతానము కలిసి చిన్నముఠా అయింది. ఈచిన్న
ముఠా ఒకప్రత్యేకము ఇంట్లో కాపురముజేసేది. ఇలాగే పెద్ద
ముఠా చిన్నచిన్నముఠాలుగా చీలి వేరువేరుఇండ్లలో కాపురం
జేయుట మొదలుపెట్టారు. ఏముఠాలోని స్త్రీలు, ఆముఠాలోని
పురుషులు, అన్నలు, చెల్లెండ్లు గనుక సంభోగించేవారు కాదు.
ఒకముఠాలోని స్త్రీలు మరొకముఠాలోని పురుషులతో సంభో
గించేవారు. ఈ చిన్నముఠాను 'జెన్సు' అని అంటారు. పెద్ద
ముఠాను ఇకముందు తెగ (tribe) అని వాడుదాము.

అనగా ఒక్కొక్క తెగలో అనేక 'జెన్సు' ఉండేవన్న
మాట. ఒక'జెన్సు'నుండి మరొకజెన్సుస్త్రీలతో కాపరంజేయు
టకు పురుషులే వెళ్ళి ఉండేవారు. అక్కచెల్లెండ్లకు ప్రత్యేక
భర్తలు లేరు. అందరి పురుషులు అందరిఅక్కచెల్లెండ్ల భర్తలే.
దీనిని ముఠాపెండ్లి అంటారు. అందువలన పిల్లలకు తల్లులే తెలుసు
గాని, తండ్రులు తెలియదు. పిల్లలు తల్లులచెప్పుచేతలలోనే
ఉండేవారు. ఒక'జెన్సు'లోని స్త్రీలంతా అక్కచెల్లెండ్లవడంవల్ల
ఎక్కువసంబంధం ఉండేది. పురుషులు వివిధ'జెన్సు'నుండి రావ
డంవలన వారిలోవారికి ఐకమత్యం ఉండేది గాదు. అందువలన
స్త్రీలే పురుషులమీద పెత్తనం జేసేవాళ్ళు. పురుషునికి ఇష్టం

లేకపోతే తనపనిముట్లను తీసుకొని తనజెన్నుకు వెళ్లిపోవలసినదే. ముఠాపెండ్లి అవుటవలన పిల్లలకు తండ్రు లెవ్వరో తెలియక పొయ్యేది. అందువలన తల్లినిబట్టియే వంశము నిర్ణయించబడేది. అందువలన తల్లిఆస్తి పిల్లలకు సంక్రమించుటయేగాక తల్లి అన్నదమ్ములఆస్తిగూడ పిల్లలకే చెందేది. స్త్రీనిబట్టి వారసత్వం ఉండే ఈఆచారమువలననే ఈసమాజం మాతృస్వామిక సమాజమని పిలువబడింది.

మతము:—తెగలు పెద్దవియగుట. ఆర్థికవిధానము క్లిష్టమగుట, ఈఆర్థికవిధానాన్ని నడపడానికి ఒక తెలివిగలవానిని నిర్ణయించడమువలన కాయకష్టం, మెదడుచే జేసేపనికి కొంచెం కొంచెంగా భేదం వస్తోంది. తెలివితేటలలో భేదం ఎక్కువ అయిపోతోంది. దీనితో చనిపోయినతెగనాయకులను, నేర్పరిత్వంతో యుద్ధం చేసేవారలను పూజించడము అరంభమయింది. దీనితోపాటు ఉరుము, మెరుపు, సూర్యచంద్రులు, నదులు మొదలగునవన్నీ తమకన్నాఉత్తమమైనవనే అభిప్రాయం ఉదయించి వానిని గూడా పూజించడము ప్రారంభమయింది. సమాజములోని భేదాలనే మానవుడు ప్రకృతికిగూడ అన్వయించి సూర్యచంద్రులు, నదులు, కొండలు మానవులకన్న గొప్ప వనే భావము కల్పించుకొన్నాడు. అందువలన చాలమంది దేవుళ్ళుండేవారు. ఏతెగకు ఆతెగకు ప్రత్యేకంగా దేవుళ్ళుండేవారు. ఈవిధంగా అదిమకమ్యూనిష్టు సమాజములోని స్వాభావిక భౌతికవాదం పోయి చాలమంది దేవుళ్ళను పూజించే మతము వచ్చింది. అప్పటిరోజుల్లో మనుష్యులవలెనే దేవుళ్ళకుగూడ అన్ని



అవయవాలు ఉంటా యనే భావం ఉండేది. అందువలననే దేవుళ్ళవిగ్రహాలు, మనుష్యుల ఆకారమును జేసి విగ్రహారాధన జేసేవారు. మతము ప్రపంచము పుట్టినప్పటినుండీ యున్నదిగాదు. ఈ మధ్య వచ్చిందే. ఉత్పత్తిసాధనాలఅభివృద్ధియొక్క ఒక దశలో పుట్టినదే.

పితృస్వామికసమాజము:—పితృస్వామ్య మనగా తండ్రి పెత్తనము. పితృస్వామికసమాజ మనగా తండ్రి పెత్తన మున్న సమాజము. ఉత్పత్తి సాధనాలు విల్లు, అంబు, రాతిగొడ్డలితోనే అగిపోలేదు. అభివృద్ధి జెందుచునే ఉన్నవి. వ్యవసాయము కనిపెట్టబడింది. మొదట మానవుడు అడవులలో ధాన్యము దానంతట అది మొలచుట, కంకులువేయుట చూచాడు. ఆకంకులు తీసుకువచ్చి, గింజలనుజేసి, విసురుకొని, ఆహారము జేసుకొని తినేవాడు (ఇప్పటికి తిరుగలి కనిపెట్టబడింది). అటుతరువాత ఆగింజలను గసికలతో గాతలు పొడిచి అందులో గింజలు వేసి మొలిపించుట నేర్చుకొన్నాడు. తరువాత పారను కనిపెట్టాడు. పారతో వ్యవసాయము చేయుట ప్రారంభించాడు. ఆవులు, గేదెలు, గుర్రములు, ఒంటెలు మొదలగు జంతువులను పెంచడము నేర్చుకొన్నాడు. వానిపాలను త్రాగడం నేర్చుకొన్నాడు. మాంసమునకు వేటమీద ఆధారపడి ఉండాలిసిన అవసరం పోయింది. ఆవులు, గేదెలు పాలనిచ్చుటయేగాక ప్రతి సంవత్సరం దూడలను పెడుతుండేవి. అందువలన మందలు పెరిగిపోయేవి.

అంతేగాదు. రాగి, టిన్ మొదలగులోహాలు కనిపెట్ట బడినాయి. ఈలోహాలు భూమినుండి తీయుట, వానితో పని ముట్లు, ఆయుధాలు, నగలు మొదలగునవి చేయడం మొదలు పెట్టబడింది. ఆవులను పెంచడం, లోహములపని, వ్యవసాయం ఒక్కతెగయే చేయుట సాధ్యపడదు. అందువలన పశువులను పెంచేతెగలు, లోహాలు వ్యవసాయం చేయుతెగలు వేరు అయినాయి. ఇంటిపని, బయటిపని విభజన మొదటి పనివిభజన. పశువులనుపెంచే తెగలు, ఇతరపనులుచేసే తెగలు వేరుఅవుట రెండవపనివిభజన. ఇప్పుడు వస్తువులమారకము పుట్టింది. పశువు లను పెంచే తెగలు పాలు, నెయ్యి, తోళ్ళు, మాంసమును ఇతరపనులు చేసే తెగలకు యిచ్చి వారివద్దనుండి లోహపు పాత్రలు, ఆయుధాలు, పనిముట్లు, నగలు, బట్టలు మొదలగు నవి తీసుకొనేవారు. మొదటవస్తువులకు వస్తువులకు మారకము జరిగేది. తరువాత పశువులు మారకపువస్తువులుగా (ఇప్పుడు మనము డబ్బువాడినట్లు) జేయబడినవి.

తండ్రివారసత్వఆచారము వచ్చుట:—స్త్రీపని వంట జేయుట, పిల్లలనుపెంచుట, కుట్టుకుట్టుట మొదలగు ఇంటిపను లనీ; పురుషుడు జీవితావసరాలకు కావలసిన ముడిసరుకులు సంపాదించుట అను పనివిభజన మాతృస్వామిక సమాజము లోనే వచ్చినదని ఇదివరకే చెప్పబడినది. పశువులను పెంచి వాటివలన పాలు, వెన్న, మాంసము రాబట్టుటవలన అదనపు సరుకులు ఉత్పత్తి అవడము మొదలుపెట్టినాయి. అందువలన స్త్రీపనికన్న పురుషునిపనికి విలువ వెక్కువైనది. ఈ పశువుల



మందలకూ, లోహాలతో చేయబడి వస్తువులకూ అధిపతి స్త్రీయా? పురుషుడా? స్త్రీ పనిజేయు పనిముట్లు స్త్రీవిగాను, పురుషుడు పనిజేయు పనిముట్లు పురుషునివిగాను స్త్రీ పురుషులపని విభజన జరిగినప్పటినుండి పరిగణింపబడుచుండేవి. ఆ ఆచారము ప్రకారమే ఇప్పుడు పశువులమందలు, లోహపు పనిముట్లు పురు షునివే? అందువలన పురుషునికి సమాజములో పలుకుబడి హెచ్చింది. అందువలన వెనుక వివరింపబడిన ముఠాపెండ్లిపద్ధతి పోయి, ఒక స్త్రీ ఒకపురుషునితో ఉండేపదతి వచ్చినది. కాని ఇష్టములేకపోతే ఎవరంతట వారు విడిపోయే హక్కుగూడా ఉంది. ఒకస్త్రీ ఒకపురుషునితోఉండే ఆచారం ఒక్కమారుగా రాలేదు. ఒక్కపురుషునితో ఉండేహక్కు ముఠాఇచ్చేందుకు గాను మొదటిముఠాలోని మగవారితో సంవత్సరమున కొక మాటు సంభోగించుట ఆచారమైనది.

అటుతరువాత తనఇచ్చవచ్చిన మగవానితో ఉండే ముందు ఒకతడవ ముఠాలోని మగవారితో సంభోగించే ఆచార మైనది. అటుతరువాత ఈఆచారముగూడా పోయి ఒకస్త్రీ ఒకపురుషుడు కలసిఉండే ఆచారం వచ్చింది. దీనితో తల్లితో పాటు వంశము తండ్రివలనగూడ తెలియడం మొదలుపెట్టింది. కాని పురాతన ఆచారమైన తల్లివారసత్వపు ఆచారము ప్రకా రము పురుషుని ఆస్తి అతనిసంతానమునకు చెందదు. అతనిఅక్క చెల్లెండ్ర సంతానమునకు చెందుతుంది. పశువులను పెంచుట మొదలగునవి సమాజము నేర్చుకొన్నతరువాత, ఒకస్త్రీ పురు షుడు కలసియుండి సంతానము పుట్టినతరువాత సమాజాభివృ

ద్ధికి ఆటంకము కలిగిస్తుంది. ఏపురుషునికన్నా తనపిల్లలకు తనఆస్తి చెందేలా చెయ్యాలని ఉంటుందిగాని తనచెల్లెండ్ర సంతానానికి ఇవ్వాలని ఉండదు. మాతృస్వామికసమాజములో ముఠాపెండ్లి రోజుల్లో తనపిల్లలెవ్వరో తనకు తెలియదు. అట్టిపరిస్థితిలో తన చెల్లెలపిల్లలే తనకు దగ్గరవారు. కనుక ఆరోజులలో తనఆస్తిని తనచెల్లెలపిల్లలకు చెందించేవాడు. స్త్రీకిగూడ తనభర్త పశువుల మందను తనపిల్లలకు చెందించుకోవాలనే ఉద్దేశ్యం పుట్టింది. అందువలన స్త్రీ పురుషుని ఆధిపత్యాన్ని అంగీకరించింది. తల్లి వారసత్వపుఆచారం బోయి తండ్రివారసత్వపుఆచారం వచ్చింది. అందువలననే ఇది పితృస్వామికసమాజమని అనబడింది. "తల్లి వారసత్వపుఆచారం పోవడం స్త్రీలకు "చారిత్రాత్మికఓటమి" అని ఎంగెల్సు మహాశయుడు 'కుటుంబముయొక్క పుట్టుక' అనే గ్రంథములో వ్రాశాడు. పురుషునిఆధిపత్యము అంగీకరింపబడి ననూ స్త్రీకి తెగయొక్క సమావేశములో హాజరయి తన అభిప్రాయమును చెప్పేహక్కు పోలేదు. ఇష్టము లేనప్పుడు భర్తను వదిలిపెట్టే హక్కుంది.

తెగలో వ్యవసాయము సమష్టిగానే చేయబడేది. పశువులు మొదలగునవి సొంతఆస్తిగాఉన్నా ఇంకా సమష్టిఆస్తియే ఎక్కువగా ఉండేది. అందువలన ఇంకా వర్గభేదాలు లేవు. ప్రభుత్వము, ప్రత్యేకసైన్యము లేవు. తెగయొక్క సమావేశమున ముఖ్యవిషయములను నిర్ణయించాలిసిందే. తెగయొక్క నాయకునికి ప్రాముఖ్యత ఎక్కువఉన్నా ఇంకనూ తెగయొక్క కార్యకర్తయే (executive officer) యీ తెగలను గూర్చి,



ఎంగెల్సు 'కుటుంబము, ఆస్తి, ప్రభుత్వముయొక్క పుట్టుక' అనే గ్రంథములో ఈవిధంగా వ్రాశాడు—"స్వాభావికంగా, సులభంగా ఉన్న జెన్సుయొక్క పరిపాలనావిధానం ఎంత ఆశ్చర్యాన్ని కలించుతుంది! సిపాయిలు లేరు; పోలీసులు లేరు; హోదాగలవారు, రాజులు, రాజప్రతినిధులు, అధికారులు, న్యాయాధిపతులుగాని లేరు; జైళ్ళు లేవు; దావాలు లేవు. అయినప్పటికీ పనులన్నీ సామాన్యముగానే జరిగిపోతాయి" అని. తగవులు, పోట్లాటలు 'జెన్సు' చేతగాని, తెగ చేతగాని వివిధ 'జెన్సు' మధ్యగాని, తెగ అంతచేగాని ఆతగవులకు సంబంధించిన అందరి చేత తీర్చబడేవి. చాల తక్కువసందర్భాలలో రక్తపాతము చివరిపనిగా ప్రకటింపబడేది. నాగరికతకు సంబంధించిన లోపాలు, అవకాశములతో కూడిన మన 'ఊరి' దానియొక్క నాగరకమైన స్వరూపముమాత్రమే. ఈ రోజులకన్న ఎక్కువగా ప్రజా సంబంధమైన కార్యములు నిర్వహించబడ వలసియున్నప్పటికీ, క్లిష్టమైన కష్టమైన పరిపాలనాపద్ధతితో కొంచెమైనా అవసరముండేది గాదు. ఆ కమ్యూనిస్టు ఇంట్లో కొన్నికుటుంబాలుండేవి. భూమి తెగకుచెందిఉండేది. కూరగాయలదొడ్లు మాత్రం తాత్కాలికంగా ఆ కమ్యూనిస్టు ఇండ్ల మధ్య పంచబడేవి. దానితో సంబంధించినవారు సమస్యను పరిష్కరించుకొనేవారు. చాలాసందర్భాలలో సంవత్సరాల తరబడి వస్తున్న ఆచారమే ముందుగానే పరిష్కరించేది. బీదకమ్యూనిస్టు ఇండ్లు ఉండడానికే అవకాశం లేదు. ముదుసలులు జబ్బుస్థితిలో నున్నవారు, వికలాంగులయెడ తమకున్న బాధ్యత 'జెన్సు'

కు తెలుసు. స్త్రీలతో సహా-అంతా సమానులే. బానిసలకుగాని పర్యాయి తెగల అణచుటకు అవకాశమే లేదు. 1561లో ఇరాక్వా యిస్ ఎరిస్ తెగను ఓడించినపుడు, వారిని తమతో సమాన హక్కులతో తమలో కలుపుకుంటామని ఆహ్వానించారు. వారు నిరాకరించినమీదనే వారిభూమినుండి తరుమబడ్డారు.

ఆ సమాజములో ఎటువంటి మంచిపురుషులు స్త్రీలు తయారయ్యారు! చెడిపోని ఎర్రఇండియనుల తెగలతో సంబంధము కలిగిన తెల్లవారందరూ, ఈ అనాగరకుల వ్యక్తిగౌరవాన్ని, నిష్కాపట్యాన్ని, మంచినడతను, ధైర్యాన్ని మెచ్చుకొన్నారు.

ఆఫ్రికాలో ఆ ధైర్యము రుజువగుట ఇప్పుడు చూచాము. జెన్సుసమాజదశలో ఉన్న జులూజాతివారు కొన్ని సంవత్సరాల క్రితం, న్యూబియనుజాతివారు కొన్ని నెలలక్రితం, ఏయూరోపియన్ సైన్యమూ చేయలేనిపనిని చేశారు. తుపాకులు లేకుండా, బల్లెములు, బరిసెలతో దగ్గరగా ఉండి పోరాడుటలో నిపుణత్వము పొందిన బ్రిటిష్ కాల్బలముయొక్క తుపాకులనుండి వచ్చుగుండ్లవర్షములో ముందుకు పోయి, చాలాతడవలు వారలను చెల్లాచెదరు చేశారు. అంతేగాక ఆయుధములలో అంత తేడా ఉన్నప్పటికీ, మిలిటరీశిక్షణ లేకపోయినప్పటికీ, డ్రిల్లు నేర్చుకొనక పోయినప్పటికీ, పారిపోయేలా జేశారు. వారికి ఎంత ఓర్పు ఉన్నదీ, 24 గంటలలో గుర్రముకన్నా ఎక్కువదూరం పోగలరని ఇంగ్లీషువారు ఒప్పుకున్నదానినిబట్టి ఋజువౌతుంది. వారల అతిచిన్నకండరము కూడా క్రొత్తదారాలవలె వేరుగా కన్పబడుతుందని ఇంగ్లీషు చిత్రకారుడు చెప్పాడు.



వర్గాలుగా విభజింపబడకముందు సమాజం దానిలో ఉండే మనుష్యులు అట్లా ఉండేవారు. ఆసమాజదశను, ఇప్పటి సమాజములో ఉండే అధిక సంఖ్యాకుల స్థితితో పోల్చితే, కార్మికుడూ, చిన్నరైతుకూ ఆసమాజములో ఉండే జెన్సు తెగలోని స్వతంత్రుడైన మనుజునికీ ఎంత తేడా ఉందో తెలుస్తుంది.

**బానిససమాజము** :—పితృస్వామికసమాజములో ఉత్పత్తి సాధనాలు అభివృద్ధి జెందుతూనే ఉన్నాయి. ఇనుమును తయారు జేయుట మానవులు కనుక్కొన్నారు. ఇనుముతో గొడ్డలి చేయబడింది. ఇనుపగొడ్డలి రావడమువలన అడవులను గొట్టి భూములను వ్యవసాయమునకు పనికివచ్చేలాగున చేయడం మొదలుపెట్టారు. ఇనుపకర్రుగలనాగలి చేసి దానిని ఎద్లు, గుర్రములచే లాగించుట మొదలుపెట్టారు. ఇంతేగాక బట్టలు నేయడానికి మగ్గము కనుపెట్టారు. ఇంతేగాక ఇంకెన్నియో చేతిపనులు చేయ మొదలిడారు. వ్యవసాయము పనివేరు, చేతిపనులు వేరు చేయబడినవి. ఈక్రొత్తపనిముట్లవలన మానవుడు తనకు కావలసినదానికన్న ఎక్కువ ఉత్పత్తి చేయగలుగుచున్నాడు. పూర్వం యుద్ధములో ఓడిపోయినవారిని తమ తెగలో కలుపుకోవడమో లేక చంపివేయడమో జరిగేది. కాని ఇప్పుడు వారిచే పని చేయించడము లాభము గనుక, వారిని బానిసలు జేయ మొదలిడారు. ఈ బానిసలు యజమానుని పశువులవలెనే యజమానుని సొత్తు. పశువుల నమ్ముకొన్నట్లుగా సంతలో అమ్ముకొనవచ్చు. పెండ్లి జేసుకోవడానికి వీలులేదు. యజమాని చంపినా ఏమీ నేరము లేదు. వీరిని మాట్లాడే పశువు లనేవారు. వీరు మొదట

మారకపువస్తువు (డబ్బు) గా వినియోగింపబడేవారు గూడా. పితృస్వామిక సమాజములోనే ఆస్తిభేదాలు రా మొదలిడినాయి. తెగయొక్క ఆర్థికనిర్మాణమును నడిపే పెద్దయొక్క కుమారుడే, ఆ పనిని నేర్చుకొని తనతండ్రితరువాత తానే పెద్దయగుట మామూలయింది. యుద్ధములో నాయకుడుగూడా యుద్ధాలు ఎక్కువఅయ్యేకొలది స్థిరఉద్యోగాన్ని పొందాడు. ఇతనికుమారుడు తనతండ్రిస్థానాన్ని ఆక్రమించేవాడు. యుద్ధములో సంపాదించినదానిలో ఎక్కువభాగములు ఈపెద్దలు ఉంచుకొని మిగతాది పంచియిచ్చుట నెమ్మదిగా మామూలయింది.

ఈ విధంగా పితృస్వామిక సమాజములో ఆస్తిభేదాలు వచ్చినాయి. యుద్ధములో ఓడిపోయి పట్టుబడినవారినిగూడా ఇలాగే పంచుకొనేవారు. బానిసలకు జెన్సుఆర్థికవిధానములో తావులేదు. కనుక సమిష్టిగాఉన్న భూమి పంచుకోబడింది. వ్యవసాయమునకూ, చేతిపనులకూ బానిసల నుపయోగించి ఆస్తిని సంపాదించుట మామూలయింది. వస్తువులఉత్పత్తి సొంతఅనుభవమునకుగాక అమ్మకముకొరకు చేయుట మొదలుపెట్టబడింది. నావలుచేయుట మొదలుపెట్టబడింది. బానిసలు మారకపువస్తువులుగా ఉపయోగించుటపోయి వెండి, బంగారము, తరువాత వాని నాణెములు మారకపువస్తువు లయినాయి. దీనితో దూరదేశములతోగూడా వర్తకము ప్రారంభమయింది. ఉత్పత్తితో సంబంధములేని వర్తకముమీద ఆధారపడిన ఒకవర్తకవర్గము బయలుదేరింది. వారు అమితలాభాలు గడించి ఆస్తులను కూడబెట్టు



చున్నారు. డబ్బు ఎప్పుడైతే సమాజములోనికి వచ్చిందో అప్పటినుండి వడ్డీవ్యాపారముగూడా ప్రారంభమయింది. అప్పులివ్వడం; చెల్లించలేని వారిదగ్గరనుండి భూమిని కట్టుకోవడము ఆరంభమైంది. అప్పు తీర్చడానికి భార్యాపిల్లలను మొదట బానిసలుగా అమ్మేవారు. అటుతరువాత వారే బానిస లయ్యేవారు. మొదట ఓడిపోయిన మరొక తెగవారు బానిసలుగా జేయబడేవారు. తర్వాత వడ్డీవ్యాపారమువలన ఆ తెగలోనివారే బానిసలుగా జేయబడినారు. ఈవిధముగా బానిసలసంఖ్య పెరిగిపోయింది. బానిసయజమానులసంఖ్య తక్కువగా ఉంది. కష్టపడి పనిచేసేవారు, ఉత్పత్తిసాధనాలను ఆస్తిగా చేసికొని ఇతరుల కష్టంమీద సుఖా లనుభవించేవారు అను రెండువర్గాలు సమాజములో బయలుదేరినాయి. సమాజాస్తి వ్యక్తిఆస్తి అయిపోయింది. వర్గరాహిత్యసమాజం వర్గసమాజ మయింది. సమిష్టిఆస్తివిధానము పోయి వ్యక్తిఆస్తివిధానము వచ్చుటకూ, వర్గరాహిత్యసమాజముపోయి వర్గసమాజము వచ్చుటకూ ఇనుపగొడ్డలి, పశువులతో లాగింపబడు ఇనుపకర్రుగల నాగలి, మగ్గము మొదలగు ఉత్పత్తిసాధనాలే కారణము.

**రాజ్యాంగయంత్రముయొక్క పుట్టుక:**—'జెన్సు' తెగలయొక్క విభజన రక్తస్పర్శనుబట్టి యుండేది. ఒక్కొక్కతెగ ఒక నిర్ణీతస్థలములో ఉండేది. కాని పైవివరింపబడిన ఉత్పత్తి సాధనాలు సమాజములోనికి వచ్చుటవలన ఒక తెగలోనున్నవారంతా ఒకేచోటున ఉండడానికి అవకాశం లేదు. ఒక 'జెన్సు' తెగలోని వర్తకులు మరొకక్రొత్తచోటుకు పోవాలిసివచ్చింది. అంతేగాక

అందరూ సమానులుగా ఉండే జెన్సు తెగనిర్మాణములో బానిస
లకు తావులేదు. ఒకే జెన్సుతెగలోని బీదలు ఆస్తిగలవారిచే
వడ్డీవ్యాపారముద్వారా బానిసలుచేయబడ్డారు. ఇష్టములేని
ఈబానిసలచే బలవంతంగా పనిచేయించుటకు 'జెన్సు' తెగ
సమాజనిర్మాణములో యేమీ యంత్రం లేదు. పోలీసు, సిపా
యీలు, కోర్టులు, జైళ్ళు లేవు. అందువలన క్రొత్త ఉత్పత్తి
సాధనాలు 'జెన్సు'తెగకు సంబంధించిన సమాజనిర్మాణములో
పనిజేయలేవు. అందువలన శిథిలమైన 'జెన్సు'నిర్మాణము తోల
గించబడి బానిసఉత్పత్తివిధానమునకుసంబంధించిన వ్యక్తిఆస్తిని
ఒప్పుకొన్న సమాజము స్థాపింపబడింది. 'జెన్సు' తెగకు సంబం
ధించిన అందరికీ సమానహక్కు లున్నసభ ఎత్తివేయబడింది.
దానిస్థానే ఆస్తిననుసరించి వర్గాలు ఏర్పరుపబడినాయి. వారి
వారిఆస్తినిబట్టి వారికి ప్రాతినిధ్యం ఇవ్వబడినది. అధికసంఖ్యా
కులుగానున్న బానిసలకు ప్రాతినిధ్యమే లేదు. ఉదాహరణకు
గ్రీసులోని ఏథెన్సురాజ్యంలో 90,000 మంది ఆస్తిఉన్నవారు,
3,65,000 మంది బానిస లుండేవారు. ఆపై 90వేలమంది ఆస్తి
గలవారిలోగూడ పెద్దఆస్తిగలవారు చాలకొద్దిమందే ఉన్నారు.
ఆస్తిఉన్నవారియొక్క శాసనసభ ఏర్పాటుచేయబడింది. ఈశాసన
సభ బానిసయజమానుల ఆస్తుల నిలబెట్టుటకు కావలసిన శాస
నముల నన్నింటినీ చేసింది. అప్పటిచట్టప్రకారం బానిసల నమ్మ
కోవచ్చు; చంపవచ్చు; ఏమైనా జేయవచ్చు. స్వతంత్రులుగా
ఉన్న బీదరైతులకు అప్పులు పెట్టి వారినిగూడా బానిసలుగా
జేయవచ్చు.



ఈచట్టాలను అమలుపరచడానికి వెనుక దౌర్జన్యం
గావాలి. లేకపోతే బానిసలు అల్పసంఖ్యాకులుగా నున్న బానిస
యజమానులమాట వింటారా? పెద్దయజమానులు, వర్తకులు
యుద్ధముజేయటం మానివేశారు. అటువంటప్పుడు ప్రత్యేకంగా
దౌర్జన్య ముపయోగించే యంత్రము కావాలి. కనుక జీతాలిచ్చి
స్థిరంగా ఉంచబడే సైన్యం ఓట్లున్నవారినుండియే ఏర్పరుప
బడింది. ఈసైన్యములో బానిసలకు తావు లేదు. ఈసైన్యం
ఉత్పత్తిలో ఏమీ పాల్గొనదు. కవాతు చేయుటం, బానిసలను
దౌర్జన్యంగా అణచటం దీనిపని. దీనితోబాటు ఆచట్టాలను
అమలుజరిపే కోర్టులు, జైళ్ళు వచ్చినాయి. ఈవిధంగా సమా
జములో పలుకుబడిగల వర్గముయొక్క, ఇతరవర్గముల దోపిడీకి
తోడ్పడే ప్రభుత్వయంత్రం పుట్టింది. వర్గసమాజముతోనే
ప్రభుత్వయంత్రం పుట్టిం దని గ్రహించాలి.

**స్త్రీ ఒక్కపురుషునితోనే ఉండే కుటుంబముయొక్క
పుట్టుక:**—పితృస్వామిక సమాజములో ఒకస్త్రీ, ఒకపురుషుడు
కలిసి నివసించేపద్ధతి ఉండేదనీ; ఇష్టములేకపోతే స్త్రీపురుషులు
విడిపోయే హక్కుండేదనీ; తెగయొక్క సభలో స్త్రీలకుగూడ
పురుషులతోపాటు సమానహక్కు లుండేవనీ వ్రాశాను. బానిస
సమాజములోని కుటుంబపద్ధతిలో స్త్రీ తనభర్తతోనే ఉండా
లిగాని, పురుషుడు ఎందరినైనా జేసుకోవచ్చు. పెండ్లిజేసుకో
కుండా ఇతరస్త్రీలతో వ్యభిచారం చేయవచ్చు (బానిసస్త్రీలకు
పెండ్లిచేసుకొనే అధికారం ఉండేదికాదు. యజమాని ఇష్టమొ
చ్చినట్లు ఉపయోగించుకోవచ్చు). స్త్రీ వ్యభిచారంచేస్తే భర్త

ఏమైనా చేయవచ్చు. చివరకు చంపవచ్చునుగూడా. భర్త చనిపోతే మరొకరిని పెండ్లిచేసుకోగూడదు. స్త్రీలకు ప్రాతినిధ్యం లేదు. పబ్లిక్ వ్యవహారాల్లో జోక్యములేదు. ఇల్లు దాటి బయటకు రాకూడదు. స్త్రీలు అస్వతంత్రలు ఎలా అయ్యారు ?

పితృస్వామిక సమాజములో తల్లివారసత్వఆచారము పోయి తండ్రివారసత్వ ఆచారము ఎలావచ్చిందీ వివరించాను. తల్లివారసత్వఆచారం పోవడంతోనే స్త్రీలఆధిక్యత పోయి పురుషుల ఆధిక్యత వచ్చింది. అయిననూ పైన జెప్పినట్లు స్త్రీలు అస్వతంత్రులు గాలేదు. ఇనుపగొడ్డలి, ఇనుపకర్రుగల నాగలి మొదలైన ఉత్పత్తిసాధనాలు రాగానే పురుషునిఆధిక్యత మరీ ఎక్కువయింది. పైవివరించినరీతిని వర్గములు ఏర్పడినాయి. వర్గరాహిత్యమైన 'జెన్సు' తెగలున్న సమాజం పోయి వర్గసమాజమైన బానిససమాజం ఏర్పడింది. బానిసయజమానుల ప్రభుత్వమేర్పడింది. జెన్సుసమాజం పోవడంతోనే, వ్యక్తిగతఆస్తి రావడంతోనే, వర్గసమాజప్రభుత్వం రావడంతోనే స్త్రీలు అస్వతంత్రులయ్యారు. ఒకస్త్రీ, ఒకపురుషుడు కలిసి ఉండేపద్ధతి పోయి స్త్రీ ఒక్కపురుషునితోనే ఉండే (పురుషుడు తనభార్యతోనే ఉండ నవసరంలేదు) కుటుంబము వచ్చింది. ఈపద్ధతియే కొంచెముమార్పుతో జమీందారు సమాజంలోనూ, పెట్టుబడిదారు సమాజములోనూ అమలులోఉంది.

**వ్యభిచారం**:—జెన్సుతెగలలో వ్యక్తిఆస్తి లేదు గనుక స్త్రీపురుషులు వారి కిష్టమొచ్చినవారినే భార్యాభర్తలుగా చేసుకొనేవారు. గుణగణములు, ఈడుజోడే ప్రాధాన్యము వహిం



చేవి. కాని బానిససమాజములో వ్యక్తిగతఆస్తిపద్ధతి రావడము వలన భార్యాభర్తలను ఏరుకొనుటలో గుణగణములు ఈడుజోడుకన్న ఆస్తియే ప్రాధాన్యము వహించింది. పైగా స్త్రీలకు స్వతంత్రత పోవుటవలన వారితలిదండ్రులే సంబంధాన్ని వెతకి తెచ్చేవారు. అందువలన చాలాదాంపత్యాలు ప్రేమశూన్యంగా ఉండేవి. భర్తమీద ఇష్టములేనిస్త్రీ విడిపోవడానికి వీలులేదు. ఏమి చేస్తుంది? అందువలన వ్యభిచారం ప్రారంభమయింది. పురుషుడు అధికారబలం ఉండుటవలన బానిసస్త్రీలతో వ్యభిచరించేవాడు. ఈవిధంగా వర్గసమాజముతో ప్రారంభమైన వ్యభిచారం వివిధవర్గసమాజాల్లో వివిధరూపాలు దాల్చింది. ఈ వ్యభిచారం వ్యక్తిఆస్తి రద్దుచేయబడిన స్త్రీలకు పూర్తి హక్కులు కలిగే వర్గరాహిత్యమైన సోషలిష్టుసమాజములోనే పోతుంది.

**వేదాంతము, మతము**:—ఆదిమ కమ్యూనిష్టుసమాజములో మతమే లేదనీ, తరువాత సమాజములలో ఆర్థికనిర్మాణము క్లిష్టమయ్యేకొలది మెదడుతో చేయుపనికి, కాయకష్టమునకు కొంత భేదం కావడంతో చనిపోయినతెగనాయకులను, వీరులను పూజించుట, సూర్యచంద్రులను పూజించుట వచ్చిందనీ చెప్పాను. అప్పటిరోజులలో మానవులదృష్టిలో వివిధ దేవుళ్ళు, మానవస్వరూపములవంటి స్వరూపములతో ఉండేవారనేభావము లుండేవి. రానురాను ఆ అభిప్రాయములు పోయినవి. బానిససమాజములో జ్ఞానేంద్రియాలతో చూడబడని మనస్సుతోనే తెలుసుకోగలిగినదేవుడు ఒకడే యున్నాడనేభావం

వచ్చింది. ఎందువలన? మార్క్సుసిద్ధాంతంప్రకారం మతము గూడ అప్పుడు ఉపయోగించే ఉత్పత్తిసాధనాలమీదనే ఆధార పడిఉంటుంది. మానవులు స్థూలప్రపంచముయొక్క ఆధారము మీదనే ఊహించుతారు. స్థూలప్రపంచము మానవుల ఊహల మీద ఆధారపడియుండదు. స్థూలప్రపంచముమీదనే మానవుల ఊహలు ఆధారపడిఉండునను మార్క్సుసిద్ధాంతాన్ని జ్ఞాపక ముంచుకోవాలి. బానిససమాజములో మెదడుతో చేయుపనీ, కాయకష్టమూ పూర్తిగా వేరైనాయి. కాయకష్టము చేయు వారు కొందరు, మెదడుతో పనిచేయువారు కొందరు. దీని నాధారంగా జేసుకొని మనస్సు వేరు, శరీరము వేరు; మనస్సే శరీరాన్ని నడుపుచున్నది; మనస్సుకు నాశనం లేదు; శరీరానికి ఉన్నది అనే భావం ఉదయించింది.

“మనస్సు ఎలా శరీరాన్ని నడుపుచున్నదో ఈప్రపంచా న్నంతా నడిపే ఒకేఒక శక్తియొకటుండాలన్నమాట. మనస్సు వలనే ఈ శక్తిగూడ జ్ఞానేంద్రియాలకు అగమ్యగోచరం” అనే భావం వచ్చింది. ఈ విధంగా దేవునికి స్వరూపంబోయి జ్ఞానేంద్రి యాలకు అందనివాడయినాడు. బానిసత్వానికి కారణం పూర్వ జన్మలో జేసుకున్న కర్మఅనీ, అనుభవించితీరాలనీ మతము బోధించేది. మతము బానిససమాజాన్ని ఎలా నిలబెట్టుచున్నదో చూడండి! మతము ఎలా బానిససమాజములోని ఉత్పత్తిసాధ నాలమీద ఆధారపడిఉందో, అలాగ్గే అప్పటిసంగీతం, సాహిత్యం, శిల్పము, చిత్రకళ మొదలగు కళలన్నీ బానిససమాజాన్ని, బానిస



యజమానివర్గాన్ని పొగడుతూ బానిససమాజాన్ని నిలబెట్టుటకే తోడ్పడేవి.

బానిససమాజంలో వ్రాతగూడా కనిపెట్టబడింది. అందు వలన కళలు అభివృద్ధి జెందినాయి. అందువలన బానిససమా జమునుండీ చరిత్ర వ్రాయబడింది. కనుక బానిససమాజమునుండి మానవసమాజచరిత్రను తెలుసుకొనుట తేలికయైనది. అంతకు ముందున్న మానవసమాజాలచరిత్ర మార్క్సుబ్రతికియున్నంత వరకూ తెలుసుకోబడలేదు. మార్క్సు, వ్రాయబడిన చరిత్రను ఆధారముగా చేసుకొనియే తనసిద్ధాంతాలను కనుపెట్టాడు. అటు తర్వాత తెల్లవారికి అమెరికా ఆఫ్రికాలలోని అనాగరికజాతు లతో సంబంధం వచ్చింది. వర్గరాహిత్యసమాజముల వివిధ దశలలో ఈ అనాగరకు లుండుటవలన, బానిససమాజమునకు ముందు మానవసమాజం వర్గరాహిత్యముగా ఉన్నదని తెలు సుకోబడినది. అయినను ఈపరిశోధన మార్క్సుసూత్రాలను ఇంకా బలపరిచింది (వ్యతిరేకానికి వ్యతిరేకం-అనే సూత్రాన్ని ఈ పరిశోధన ఇంకాబలపరిచింది). మొదట వర్గరాహిత్యసమాజాలు వ్యతిరేకముచేయబడి వర్గసమాజాలు వచ్చినవనీ, తరువాత వర్గసమాజాలు వ్యతిరేకంచేయబడి మరల వర్గరాహిత్య సమాజం వస్తుం దనీ ఏంగెల్సు పూర్తిజేశాడు.

**జమీందారీసమాజము:**— బానిససమాజములో బీద రైతులుగూడా నెమ్మదినెమ్మదిగా వడ్డీవ్యాపారమువలన బానిస లుగా చేయబడిరి. పట్టణాలలో బానిసయజమానులక్రింద ఎక్కు వమంది బానిసలు ఒక్కచోట కార్ఖానాలలో పనిజేయుచూ

చేతిపరిశ్రమలవస్తువులను ఉత్పత్తిచేయుచుండిరి. పల్లెలలో బానిస యజమానులక్రింద పెద్దపెద్ద వ్యవసాయశాలలలో, పండ్లతోట లలో పనిజేయుచుండిరి. ఈబానిససమాజములో ఉత్పత్తిసాధ నాలయొక్క అభివృద్ధి అంత ఏమీలేదు. క్రొత్తగాఏర్పడిన ప్రభుత్వము ప్రజలను పీల్చిపిప్పిజేసి వేసింది. శిస్తులు వసూలుజేసే ఉద్యోగస్థులలంచాలు, సైనికులదోపిడీలు మితిమీరిపోయినాయి. దీనితో నానాటికి ప్రజలలో బీదరికం ఎక్కువయైపోయింది. ప్రజ లలో కొనుబడిశక్తి తగ్గిపోయింది. వర్తకం పడిపోయింది. పట్ట ణాలు క్షీణించిపోయినవి. దీనితో బానిసయజమానులు బానిస లను పనిలేకుండా పోషించాల్సివచ్చింది. బానిసలవలన లాభ ము లేకపోవుటయేగాక, నష్టముగా ఉండుటవలన బానిసలను బానిసయజమానులు వదలివేయడం మొదలుపెట్టారు. పట్టణా లలో ఉండేకార్ఖానాలుపోయి మరల వ్యక్తులుగా ఎవరంతట వారు చేతిపనులను జేసుకొనేపద్ధతి వచ్చింది. వ్యవసాయక వస్తు వులకుగూడా అమ్మకం తగ్గడంవలన పల్లెలలోగూడా బానిసయజ మానులు బానిసలను వదలివేయడం మొదలుపెట్టారు. కొద్ది మంది బానిసలను ఉంచుకొని కొంతపొలమును బీళ్లుగా ఉంచు కొని పశువులమందల పెంపకాన్ని మొదలుపెట్టారు. మిగతా పొలాన్ని మొదటనుండి స్వతంత్రులుగా ఉన్నరైతులకు, బాని సలకు కౌలు కివ్వడం మొదలుపెట్టారు. ఈకౌలుదార్లు ఒకసారి భూమినితీసుకొన్న తరువాత దానిని భూమియొక్క యజమాని సమ్మతిలేకుండా వదలిపెట్టడానికి హక్కులేదు. కౌలుదారుపాటు భూమునిగూడ భూమియజమాని అమ్ముకోవచ్చును. యజమా



నికి కొంతవెట్టి (ప్రతిఫలములేనిపని) గూడ ఈకౌలుదారు చేయ వలసియుండును. ఈభూయజమానులను జమీందార్లు అన వచ్చును. అంతేగాక బానిససమాజమునుండి స్వతంత్రులుగా ఉంటూఉన్న కొంతమంది రైతులు, ప్రభుత్వోద్యోగులు, సైనికులబాధలు పడలేక బలము గలవారిఅండను జేరి వారిరక్షణ క్రింద ఉండడంమొదలుపెట్టారు. రక్షణ ఇచ్చినందుకుగాను రైతులు భూమిమీద తమ కున్న హక్కును బలముగలవారి కిచ్చివేసి, తాము పండించినదానిలో కొంతభాగంగూడా ఇచ్చే వారు. ఈవిధంగా స్వతంత్ర రైతులుగూడా కౌలుదార్లు అయ్యారు. క్రిస్టియను మఠాలుగూడ చుట్టుపట్లనున్న రైతు లకు రక్షణ ఇచ్చి రైతులను కౌలుదార్లను జేసికొని దోపిడిలో ప్రత్యక్షంగా పాల్గొనమొదలిడినాయి. ఇంతవరకూ చర్చి బానిస యజమానుల ప్రభుత్వానికి అండగా ఉండి పరోక్షంగా దోపిడీకి తోడ్పడేది. కాని దరిమిలా సొంతసైనికులను ఏర్పాటు జేసుకొని జమీందారీలు ఏర్పాటుజేసి ప్రత్యక్షంగా ప్రజలను దోపిడీజేయ మొదలుపెట్టినవి. ఈవిధంగా జమీందారీవిధానం వచ్చింది. పైజెప్పిన దానినిబట్టి దోపిడీవిధానంలో కొంతమార్పు జరిగింది. కష్టపడి పనిజేసేవారు బానిసవిధానములో పశువులతో సమాన ముగా చూడబడేవారు. జమీందారీవిధానంలో సొంతంగా పొల ములోపని జేసుకొని జీవించడానికీ, పెండ్లి జేసికొనడానికీ వీలుకలి గింది. అంతేగాని పెత్తనం జమీందారులచేతులలోనుండి సేద్యము చేసేవారిచేతుల్లోకి రాలేదు. చాలావరకు బానిస యజ మానులే జమీందారు లయ్యారు. బానిసయజమానులు ఆర్థిక

కారణాలవలన, కొంచెము అభివృద్ధికరమైన జమీందారీ విధానాన్ని ఒప్పుకోవలసివచ్చింది. బానిససమాజములో బానిసయజమానుల ప్రజాస్వామ్య ప్రభుత్వం ఉండేది. శాసనసభ ఉండేది. ప్రాతినిధ్యం బానిసలకు మినహాయించి మిగతా ప్రజలకుండేది. జమీందార్లతోపాటు, బానిసయజమానుల ప్రజాస్వామ్యంగూడా బోయి, దానిస్థానే రాజులు బయలుదేరారు. సేనానాయకులు ఇతర దేశాలను జయించి పలుకుబడిని సంపాదించి నెమ్మదినెమ్మదిగా శాసనసభల పలుకుబడిని తగ్గించి రాజులయ్యారు. ఈవిధంగా రాజరికంవచ్చింది. ఈవిధంగా బానిససమాజము పోయి, పూర్తిగా జమీందారీసమాజం వచ్చింది. జమీందారీ సమాజంలో రైతులను పీడించే జమీందార్లు, వారిపైన పీడావిధానాన్ని నిలిపేరాజు ఉంటాడు. చేతిపనులు పట్టణాలలో వ్యక్తిగతంగా సాగింపబడతాయి. వివిధ చేతిపనులు చేసేవారికి వారివారి సంఘాలు ఉంటాయి. వీనినే గిల్డ్సు అంటారు. ఇలాగే వివిధదేశాలకు ఉంటుంది. బానిససమాజం క్రీస్తుపుట్టకముందు షుమారు 600 సంవత్సరాలనుండి క్రీస్తుపుట్టినతరువాత 500 సంవత్సరాలవరకూ సాగింది. బానిససమాజంలో ఉత్పత్తిసాధనాలు అంతఎక్కువగా సాగలేదు. అందువలన మానవసమాజంగూడా అంతగా అభివృద్ధిజెందలేదు. బానిససమాజములో అభివృద్ధిజెందిన పట్టణాలు బానిససమాజ ఆఖరుదశలో నాశనమయినాయి. వర్తకం నశించింది. పెద్దపెద్ద వ్యవసాయశాలలు పోయి, భూమి ఛిన్నభిన్నముక్కలుగా అయి వ్యవసాయం చేయబడడం మొదలుపెట్టింది.



<u>రోము సామ్రాజ్యపతనము:</u>— బానిససమాజము జమీందారీ సమాజములోనికి ఎలా మారిందో తెలుసుకోవాలంటే, రోముసామ్రాజ్యపతనము ఉదాహరణగా తీసుకొంటే తెలుస్తుంది. రోముప్రభుత్వం గ్రీసు, ఫ్రాన్సు, స్పెయిన్, ఇంగ్లండు మొదలగు దేశాలనన్నిటినీ జయించి పెద్దసామ్రాజ్యాన్ని ఏర్పరచింది. ఈదేశాల్లో అంతకుముందుఉన్న 'జెన్సు' తెగల వర్గరాహిత్య సమాజనిర్మాణాన్ని రద్దుచేసి రోములోవలె బానిసవిధానాన్ని అమలుజరుపుతూ వచ్చింది. రోము మొదలగు పట్టణాలు చాలా అభివృద్ధిజెందినాయి. కాని కొంతకాలంతరువాత రోముసామ్రాజ్యం తనబరువుతో అదే కూలిపోక తప్పిందిగాదు. ప్రభుత్వోద్యోగుల, సైనికుల దోపిడీలతో ప్రజలు దరిద్రులయ్యారు. బానిసయజమానులవర్గానికీ ఇతరప్రజలకూ ఒకరిమీద ఒకరికి నమ్మకమూ లేదు, ప్రేమా లేదు. ఒకప్రాంతానికీ మరొకప్రాంతానికీ ఐకమత్యమూ లేదు. ఒకప్రభుత్వమే వివిధవర్గాలను, వివిధ ప్రాంతాలమధ్య ఒకటే బంధమైనది. ఈబంధముగూడా రానురాను చాలా బలహీనమైనది. ఉత్తరాన జర్మనుజాతి ఇంకనూ వర్గరాహిత్యమైన పితృస్వామిక సమాజములోనే ఉన్నది. రోము గ్రీసులలోవలె బానిససమాజము రాలేదు.

జర్మనుజాతిలో జనాభా విపరీతముగా పెరిగిపోయి రోము సామ్రాజ్యంమీదబడి దోచుకొన మొదలుపెట్టారు. క్షీణదశలోనున్న రోముసామ్రాజ్యము ఉన్నత నాగరికతతో కూడియున్నప్పటికీ, అనాగరికులైన జర్మనులు వర్గరాహిత్యమైన ఆర్థికనిర్మాణములో ఉండుటవలన జర్మనుల తాకిడిక్రింద ము

క్కలు ముక్కలై పోవ మొదలుపెట్టింది. సామాన్యప్రజ జర్మనులను తమరక్షకులుగా భావించారు. చాలాప్రాంతాలు జర్మనుల వశమైనవి. జర్మనులు వర్గరాహిత్యమైన సమాజదశలో ఉండుటవలన జయించినరాజ్యాలను పరిపాలించుటకు వీలులేక పోయింది. అందువలన జర్మనులుగూడ తమవర్గరాహిత్య సమాజాన్ని వదలి వర్గసమాజాన్ని స్వీకరించవలసి వచ్చింది. ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయవలసి వచ్చింది. అందువలన మొదట జర్మను సేనానాయకులే జయించినరాజ్యాలను తమఉపనాయకుల సలహాతో పరిపాలింప మొదలిడారు. కొంతకాలానికి సేనానాయకులే రాజులయ్యారు. వారిరాజ్యాలను నిలబెట్టుకొనడానికి జర్మనులు కానివారిలోనుండిగూడ పలుకుబడిగలవారిసహాయం తీసుకోవలసి వచ్చింది. వారికి కొంతభూమిని ఇచ్చారు. మామూలుప్రజ జర్మనులు, ఇతరులు నెమ్మది నెమ్మదిగా కలిసిపోజొచ్చారు. జర్మనులలో జెన్సునిర్మాణము అంతరించింది. రాజులయొక్క సహాయకారులైన ఆ పలుకుబడిగలవా రంతా తమరక్షణక్రింద మామూలు ప్రజలను తీసుకొని జమీందారులయ్యారు. ఈవిధంగా పితృస్వామిక సమాజమునుండి జర్మనులు జమీందారీసమాజములోనికి ఒక్కగంతు వేశారు. మధ్యవారికి బానిససమాజమే లేదు. కారణం బానిససామ్రాజ్యమైన రోము సామ్రాజ్యాన్ని పడగొట్టుచూ తాము బానిససమాజమునునిర్మించలేదు. పితృస్వామికసమాజస్థితిలో ప్రభుత్వములేకుండా నుండుటవలన జయించినరాజ్యాలను పాలించడానికి వెంటనే ప్రభుత్వమేర్పడాలసివచ్చింది. అందువలన సేనానాయకులే రాజులయినా,



అడుగున 'జెన్సు' నిర్మాణపద్ధతి అలాగే ఉంచాలసివచ్చింది. జెన్సు నిర్మాణములో బానిసలకు ఏమాత్రమూ తావు లేదు. అందువలన బానిససమాజము లేకుండానే జమీందారీ సమాజములోనికి జర్మనులు పోయారు.

రోము సామ్రాజ్యము జర్మను అనాగరికుల దాడిముందు విచ్ఛిన్నమయింది. రోము మొదలగు పెద్దపట్టణాలు క్షీణించినాయి. వర్తకము నశించింది. బానిసశ్రమమీద ఆధారపడియున్న పరిశ్రమలు, వ్యవసాయము క్షీణించినవి. బానిసశ్రమ లాభములేకపోవుటవలన బానిసయజమానులు బానిసలను వదలివేశారు. స్వంతంగాచేసే చేతిపనులు అభివృద్ధిచెంద సాగాయి. బానిసయజమానుల వ్యవసాయశాలలు చిన్నచిన్న ముక్కలుగా చేయబడి స్వతంత్రరైతులకు, బానిసలకు కౌలుకివ్వబడినవి. ప్రభుత్వము బలహీనమవుటవలన అశాంతిహెచ్చింది. దోపిడీలు హెచ్చినవి. రైతులు రక్షణకుబదులుగా తమకు భూమిమీదనున్న హక్కును, పలుకుబడిని బలముగలవారికి వదలి వారివద్దనుండి రక్షణను పొందారు. సామాన్యముగా ఈపలుకుబడిగలవారు పూర్వపు బానిసయజమానులుగానే ఉండినవారే. ఈ పలుకుబడిగలవారు జమీందారులయ్యారు. ఈవిధముగా ఇటలీ గ్రీసుదేశాల్లో బానిససమాజము పోయి జమీందారీ సమాజం వచ్చింది. రోము సామ్రాజ్యమును బానిససమాజమునుండి బయటకు లాగి అభివృద్ధిమార్గాన బెట్టుటకు, జర్మన్ అనాగరికులు కావలసివచ్చారు. యూరప్‌లో బానిససమాజస్థితిలోనున్న రోముసామ్రాజ్యము వర్గరాహిత్యమైన పితృస్వామిక సమాజ

స్థితిలోనున్న జర్మన్ జాతులు కలిసి ఒకదానిమీద మరొకదాని ప్రభావమువలన యూరపులో జమీందారీ సమాజమును ఏర్పరచి, యూరపును మరల అభివృద్ధిమార్గాన పెట్టినవి.

**పెట్టుబడిదారీసమాజము:—** జమీందారి సమాజములో ఉత్పత్తిసాధనాలు, అభివృద్ధిజెంద మొదలిడినాయి. వర్తకము మరి అభివృద్ధిజెందింది. వర్తకులు ధనాన్ని ఆర్జించారు. ఆవిరియంత్రము కనిపెట్టబడినది. ఇంతవరకు పనిముట్లకు వాటంతటవి తిరిగేశక్తి లేదు. మానవునిశక్తిచే అవి కదపబడేవి. ఆవిరియంత్రం అట్లుగాక నీటిఆవిరిచే అది కదులుచూ పనిముట్లు కదిలేలాగు చేస్తుంది. దీనివలన మానవునిశ్రమ ఆవిరియంత్రమే చేయ మొదలిడింది. దీనితో ఉత్పత్తిసాధనాలలో గొప్పమార్పు జరిగింది. ఈ ఆవిరియంత్రము అన్నిపరిశ్రమలలో ఉపయోగింపబడింది. బట్టపరిశ్రమలో చేతిమగ్గము, రాట్నముస్థానాన్ని; ప్రయాణసౌకర్యములలో రైలుబండిగా ఎడ్లు, గుర్రపుబండ్ల స్థానాన్ని ఆక్రమించింది. క్రమక్రమంగా అన్ని చేతిపనిముట్లనూ సమాజమునుండి పోదోలసాగింది. ఈఆవిరియంత్రమువల్ల మానవుని శ్రమశక్తి విలువ హెచ్చింది అనగా మానవునిశ్రమశక్తి చేతి పనిముట్లతో పనిజేసినదానికన్న ఆవిరియంత్రములతో పనిజేస్తే అనేకరెట్లు ఎక్కువ ఉత్పత్తి చేయగలుగుతుంది. అనగా చేతిమగ్గముతో ఒక గంటలో ఒక గజము గుడ్డను నేయగలిగితే ఆవిరియంత్రముతో గంటలో 10, 12 గజములగుడ్డను నేయగలుగుతున్నాడు. మానవుడు కనీసం జీవించుటకు కావలసిన దానికన్న ఆవిరియంత్రముతో చాలా ఎక్కువగా ఉత్పత్తిచేయగలుగు



తున్నాడు. పెట్టుబడిపెట్టి మానవుని శ్రమశక్తినికొని (కూలి ఇచ్చి) ఆవిరియంత్రంమీద పనిచేయించితే లాభం చాలావస్తుంది. అందువలన వర్తకులు వర్తకముద్వారా తాము సంపాదించిన ధనమును పెట్టుబడిగాపెట్టి పెద్దపెద్ద ఫ్యాక్టరీలు పెట్టి కార్మికుల నుపయోగించి లాభాలు తీయసాగిరి. ఈఫ్యాక్టరీ యజమానులు, చేతిపరిశ్రమదారులకన్న చవుకగా వస్తువుల నమ్మగలిగారు. అందువలన చేతిపరిశ్రమదారులు పెట్టుబడిదార్లతో పోటీకి నిలువలేకపోయారు. చేతిపరిశ్రమలునశించినవి. చేతిపరిశ్రమదారులు ఫ్యాక్టరీలలో కూలీలుగా జేరవలసివచ్చింది. వర్తకం చాలా అభివృద్ధిచెందింది. పారిశ్రామికంగా వెనుక బడియున్న దేశాలనుండి విపరీతంగా ధనము ఆర్జింపబడింది. ఈ ధనము నుపయోగించి ఇంకా ఎక్కువగా పరిశ్రమలను పెట్టుబడిదార్లు అభివృద్ధి చేయాలనుకొన్నారు. కాని పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి చెందుటకు జమీందారీసమాజంమూడువిధాలుగా అడ్డుతగులుతూవచ్చింది. (1) అభివృద్ధి అగుచున్న పరిశ్రమలకు పట్టణాలలో చేతిపరిశ్రమలు పోగా కార్మికులయినవారు చాలలేదు. పల్లెలలో రైతులు భూమికి అంటగట్టబడిఉండటమువలన జమీందార్లు అనుమతి లేకుండా రైతులు కూలీలుగా పట్టణమునకు వచ్చుటకు వీలు లేదు. (2) ఇతరదేశములనుండి పరిశ్రమలకు కావలసిన ముడిసరకులు, తినుబండారపువస్తువులు, చౌకగా కొనడానికి వీలున్నా తమదేశములోనే ఎక్కువధరలుపెట్టి కొనవలెను. కారణం జమీందారీ ప్రభుత్వం ఉండుటచే (3) భూమి జమీందార్ల సొంతఆస్తి అగుటచే పశువులచే లాగబడు నాగలిని తీసివేసి వ్యవసాయ

ములోగూడ ఆవిరియంత్రము నుపయోగించి చౌకగా ముడిసరకుల నుత్పత్తిచేయుటకు వీలులేదు.

పైనవ్రాసినదానినిబట్టి ఉత్పత్తిసాధనాలు జమీందారీ సమాజముతో సంబంధించిన ఉత్పత్తిసంబంధాలలో ఇంక అభివృద్ధి జెందలేవు. అభివృద్ధి చెందాలంటే క్రొత్తఉత్పత్తిసాధనాలు పాతఉత్పత్తిసంబంధాలను తెంచుకొని బయటపడాలి. జమీందారీ ప్రభుత్వము బోయి పెట్టుబడిదారీ ప్రభుత్వం రావాలి. జమీందారీ ప్రభుత్వం పోవాలంటే విప్లవం రాందే అది జరగదు. అందువలన పెట్టుబడిదారీ విధానము అభివృద్ధిచెందిన ప్రతిదేశములో పెట్టుబడిదారీవర్గము కార్మిక వర్గసహాయముతో జమీందారీ ప్రభుత్వాన్ని పడగొట్టి పెట్టుబడిదారీ ప్రభుత్వస్థాపన కోసం పోరాడమొదలిడింది. కార్మికవర్గము పెట్టుబడిదారీ వర్గమునకు ఎందుకు సహాయంచేసినదంటే—జమీందారీ సమాజ సంబంధాలుపోయి పెట్టుబడిదారీ సమాజసంబంధాలు రావడము కార్మికవర్గముయొక్క ప్రయోజనమైయున్నది.

పారిశ్రామికంగా ఇంగ్లాండు ఎక్కువ అభివృద్ధిజెందింది గనుక పెట్టుబడిదారీవర్గము మొట్టమొదట ఇంగ్లండులో జమీందారీ వర్గానికి వ్యతిరేకంగా 1642 లో క్రాంవెల్ విప్లవాన్ని లేవదీసింది. పెట్టుబడిదారీవర్గం జయంబొందింది. రాజైన ఒకటవ చార్లెస్ నరికివేయబడ్డాడు. అటుతరువాత మరలకొంత అధికారం రెండవచార్లెస్ కాలంలో జమీందారీవర్గము చేతుల్లోకి పోయినా 1688 లో ఒకటవవిలియంకాలంలో మరలపెట్టుబడిదార్లు పూర్తి అధికారాన్ని సంపాదించారు. ఇంగ్లండులో రాజు, ప్రభువుల సభ



యున్నా నామమాత్రమే. శాసనసభయైన హౌస్ ఆఫ్ కామన్సు చెప్పినట్లు వినవలసిందే. పెట్టుబడిదారీప్రభుత్వం స్థాపింపబడుటతోనే ఇంగ్లండు పారిశ్రామికంగా చాలా అభివృద్ధి చెందింది. వలసరాజ్యాలు సంపాదించి ప్రపంచములోనికల్లా పెద్ద సామ్రాజ్యమైనది. తరువాత పారిశ్రామికంగా అభివృద్ధిజెందినదేశం ఫ్రాన్సు. ఇంకా పెట్టుబడిదారీవర్గం 1789 లో విప్లవంజేసి అధికారాన్ని హస్తగతంజేసుకొని, రాజరికాన్ని రద్దుజేసి పూర్తిగా పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని స్థాపించింది. మధ్యమధ్య అప్పుడప్పుడు రాజరికం వచ్చినా 1871 లో పూర్తిగా రాజరికాన్ని రద్దుజేసి శాశ్వతంగా పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని స్థాపించింది. 1789 లోని ఫ్రెంచి మహావిప్లవమే ప్రపంచములోని అన్ని దేశముల పెట్టుబడిదారీవర్గములకు ఆదర్శమై చాలాదేశములలో పెట్టుబడిదారీ వర్గాలు కొంచెం వెనుకాముందుగా విప్లవాలుచేసి అధికారాన్ని హస్తగతంచేసుకొన్నవి. కొన్ని దేశములలో పెట్టుబడిదారీవర్గాలు కార్మికవర్గచైతన్యమును జూచి భయపడి, జమీందారీవర్గాలతో రాజీ జేసుకొన్నవి. అట్టిదేశములలో పెట్టుబడిదారీ విప్లవము ఇంకా పూర్తిగాలేదు. పోలెండు, రొమేనియా, బల్గేరియా మొదలగు దేశాలు ఇట్టిస్థితిలో ఉన్నవి.

**వలసరాజ్యములు, పెట్టుబడిదారీవర్గము :**—ముందే పరిశ్రమలు అభివృద్ధిచెందిన ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలగు దేశములలోని పెట్టుబడిదారీవర్గములు, తమసరుకుల నమ్ముకొనుటకు, ముడిసరుకులను చౌకగా కొనుటకు పారిశ్రామికంగా వెనుకబడి యున్న దేశాలను ఆక్రమించినవి. ఈదేశాలనే వలసదేశా

లంటారు. ఈదేశములలో తమపెట్టుబడిదారీ విధానానికి దెబ్బ తగులకుండా పరిశ్రమలను సామ్రాజ్యవాద పెట్టుబడిదారీవర్గాలు అభివృద్ధి గానివ్వవు. అందువలన ఈసామ్రాజ్యవాద పెట్టుబడిదారీవర్గాలు వలసదేశాలలో జమీందారీ వర్గాలను పడిపోకుండా నిలబెట్టుతాయి. ఇండియాలోనికి ఇంగ్లీషువారు వచ్చేటప్పటికి జమీందారీవిధానం లేదు. మొగలు ప్రభుత్వమే ఉద్యోగస్థుల ద్వారా పన్నులు వసూలుచేసేది. ఇంగ్లీషువారు ఇండియాను ఆక్రమించిన తరువాత శిస్తులు వసూలు చేయలేక మొదట పన్నులవసూళ్లను ఇజారాపెట్టినారు. అటుతరువాత ఆఇజారాదార్లను ఖాయంజేశారు. ఈ జమీందార్లు రైతులను ఇచ్చవచ్చినట్టు బాధించి అందులో చాల కొద్దిభాగాన్నే ప్రభుత్వానికి పేష్కస్‌గా కట్టేవారు. రైతుతిరుగుబాట్లు అధికమగుటవలన ప్రభుత్వం తనకేమోసంరాకుండా జమీందర్ల ఎక్స్‌ప్లాయిటింగ్ విధానానికి కొన్నిహద్దుల నేర్పరచింది. 1857 విప్లవముకుముందు ప్రభుత్వము మిగిలిన స్వదేశసంస్థానాలను లాక్కొని జమీందారీ విధానాన్ని రద్దుచేసి రైత్వారీ విధానాన్ని పెట్టి ఎక్కువలాభాలు సంపాదించాలని ప్రయత్నించింది. కాని 1857 విప్లవములో బ్రిటిష్‌వారి పరిపాలనకు గొప్ప గండం తప్పింది. దానితో ప్రభుత్వం భయపడి జమీందార్లను, స్వదేశసంస్థానాలను ఆధారంగా జేసుకొని, ప్రజలను మూఢులుగాఉంచి, జమీందార్ల స్వదేశసంస్థానాల సహాయంతో ప్రభుత్వం చేయదలచుకొన్నారు. అప్పటినుండి జమీందార్లు స్వదేశసంస్థానాలు పడిపోకుండా కాపాడుట ప్రభుత్వముయొక్క విధానమైయున్నది. మనదేశములో పరిశ్రమలనుగూడ అభివృద్ధి గానీయకుండా స్వదేశపరిశ్రమలమీద ఎక్కువపన్నులు వేయుట తమదేశములనుండి దిగుమతిఅగుచున్న వస్తువులమీద పన్నువేయకుండా ఇప్పుడిప్పుడే అభివృద్ధియగుచున్న ఇండియాపరిశ్రమలను పోటీలో పడగొట్టుట మొదలైనపనులు చేయుచున్నదని కొంతమంది ప్రముఖుల అభిప్రాయమైయున్నది. అందువలన మనదేశములో ఇంకనూ జమీందారీ సమాజము పోలేదు. పెట్టుబడిదారీ ప్రజాస్వామ్య విప్లవం పూర్తి కాలేదు.



సోషలిష్టుసమాజము:—పెట్టుబడిదారీ సమాజములో ఉత్పత్తిసాధనాలు విపరీతంగా అభివృద్ధి జెందినాయి. ఆవిరి యంత్రం తరువాత నూనెయంత్రం (మోటారుకార్లు ఆయిల్ ఇంజనులు) కనుపెట్టబడినది. డయనమో (విద్యుచ్ఛక్తిని తయారుచేయుయంత్రము) కనుపెట్టబడింది. ఎలిక్ట్రిక్ మోటారు (విద్యుచ్ఛక్తిచే యంత్రములను ఆడించునది) కనుపెట్టబడింది. అటుతరువాత జలపాతములనుండి చౌకగా విద్యుచ్ఛక్తిని తయారుచేయుట కనిపెట్టబడింది. పైజెప్పిన యంత్రములు ఒకదానికన్న మరొకటి అభివృద్ధికరమైనవి. పై యంత్రములవలన మానవునిపని ఇంకనూ తేలికమైనది. జలపాతములనుండి విద్యుచ్ఛక్తి తీయ మొదలుపెట్టిన తరువాత బొగ్గు నూనెయొక్క స్థానాన్ని విద్యుచ్ఛక్తి తీసుకొంది. అనేక వందలమైళ్ళు తీగల ద్వారా విద్యుచ్ఛక్తిని పంపి దూరదూరాన ఉన్న ఫ్యాక్టరీలను గూడా నడుపగలశక్తి మానవులకు వచ్చింది. దీనివలన ఉత్పత్తి ఇంకా తేలికమైనది. శ్రమ శక్తి విలువ హెచ్చినది. అనగా

ఆవిరియంత్రము, నూనెయంత్రము, ఉపయోగించడానికన్న విద్యుచ్ఛక్తిని ఉపయోగించితే మానవుడు ఇంకా ఎక్కువ ఉత్పత్తి చేయగలడు. విద్యుచ్ఛక్తి ఒకచోటనుండి మరొకచోటుకు తీగెల ద్వారా తీసుకొని వెళ్ళబడుతుంది.. బొగ్గు నూనె రైళ్ళమీద మోయబడాలి గనుక చాల ఎక్కువశ్రమ ఖర్చు అవుతుంది. అంతేగాక విద్యుచ్ఛక్తి ఉపయోగించు ఫ్యాక్టరీలలో, బొగ్గు నూనె ఉపయోగించే ఫ్యాక్టరీలకన్న తక్కువమంది కార్మికులు సరిపోతారు. బొగ్గును ఉపయోగించే ఫ్యాక్టరీలలో బాయిలర్ (ఆవిరిని తయారుచేయునది.) ప్రత్యేకంగా ఉండాలి. దీనిని నడుపుటకు కొంతమంది కార్మికులు గావాలి. దీనికి ప్రత్యేకస్థలం కావాలి. విద్యుచ్ఛక్తి ఉపయోగించే ఫ్యాక్టరీలలో బాయిలర్ ఉండదు. తిన్నగా విద్యుచ్ఛక్తియే చిన్న యెలిక్ట్రిక్ మోటారు ద్వారా ఫ్యాక్టరీలోని యంత్రాల నన్నింటినీ కదిలించగలదు. అందువలన విద్యుచ్ఛక్తి బొగ్గు నూనెలకన్న అభివృద్ధికరమైనది. దీనివలన ఇంకా పెద్దపెద్దయంత్రాలు వచ్చినాయి. ఉత్పత్తి చాలా ఎక్కువఅయినది. ప్రజలలో ఈ యంత్రములు తయారుచేయునంత కొనుబడిశక్తి లేదు. అందువలన ఆర్థికమాంద్యములు వచ్చినవి. ఫ్యాక్టరీలు మూతబడినాయి. పెట్టుబడిదారులకు లాభం రావడంలేదు, ఉత్పత్తిసాధనాల అభివృద్ధి ఆగిపోయింది. పెట్టుబడిదారీ ప్రభుత్వాలమధ్య యుద్ధ మారంభమయింది. ఇంకా ఉత్పత్తిసాధనాలు లాభాలే మూలముగాగల పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలలో అభివృద్ధికాలేవు. అభివృద్ధికావాలంటే పెట్టుబడిదారీ ఉత్పత్తిసంబంధాలు పోయి ప్రజలయొక్క ఉపయో-



గమే ఆదర్శముగాగల సోషలిష్టు ఉత్పత్తిసంబంధాలు రావాలి. అప్పుడుగాని మానవ సమాజము ముందుఅడుగు వేయలేదు. ప్రపంచములో అయిదవవంతు భూభాగంలో అప్పుడే సోషలిష్టు సమాజం స్థాపింపబడినది. వివిధ దేశాలలో కార్మికవర్గాలు కమ్యూనిష్టుల నాయకత్వంక్రింద సోషలిష్టు సమాజస్థాపనకు పాటుబడుచున్నవి.

**ఇండియాదేశములో మానవసమాజముయొక్క వివిధ దశలు, వేదకాలము, వర్గరహితమైన ఆదిమసమాజాలు:—** మన దేశములో మొట్టమొదట ద్రవిడులు నివసించేవారు. ఆర్యులు మన దేశమునకు వచ్చేటప్పటికి వీరు వర్గరహితమైన సమాజదశల్లో ఉండేవారు. అంతకన్నా వీరినిగూర్చి తెలుసుకొనుటకు ఆధారములులేవు. ఆర్యులు మధ్యఆసియానుండి కైబర్ బోలన్ కనుమల గుండా మనదేశములో ప్రవేశించారు. మొదట వీరు సింధునది ప్రాంతములో నివసించారు. ఆటుతరువాత గంగానది వెంబడిబడి బెంగాలువరకు పోయారు. ఆదిమనివాసులైన ద్రావిడులను ఓడించి దక్షిణానికి తరిమారు. ఆకాలములో వీరి సమాజపద్ధతిని తెలుసుకొనుటకు వేదాలే ఆధారములు. వేదకాలంలో ఆర్యులలో వర్గాలు లేవు, వర్ణభేదము లేదు. వర్ణభేదము ఆటుతరువాతనే వచ్చినది. ఆర్యులు మనదేశములో పశువుల మందలతో ప్రవేశించారు. వారికి జీవనాధారము పశువుల మందలే. అప్పటికి వారికి నాగలితో వ్యవసాయం చేసేపద్ధతి, మగ్గముతో బట్టలు నేసేపద్ధతి తెలియదు. వారు పశువులమందలతో నదులయొడ్డుననున్న పచ్చిక బయళ్ళ వెంబడి పోయారు. కనుక ఆర్యులు

ఇండియాకు వచ్చేటప్పటికి పితృస్వామిక సమాజదశలో ఉన్నా రని తేలుతుంది. వేదకాలము ఆర్యులకు పితృస్వామిక సమాజ మన్నమాట!

పురాణకాలము — వర్గభేదము — బానిససమాజము:—

క్రమముగా ఆర్యులు ఎద్దులతో నాగలి లాగించి వ్యవసాయము చేయడం నేర్చుకొన్నారు. ఇనుమును తయారుచేయుట దానితో ఆయుధాలు, పనిముట్లుచేయుట నేర్చుకొన్నారు. దానితో వర్గము లారంభమైనాయి. ఈవర్గములే వర్ణములుగా చెప్పబడి నాయి. వర్ణభేదమునకు మూలము అప్పటి సామాజిక ఉత్పత్తి విధానమే. ఆకాలములోని ఆర్య న్యాయశాస్త్రవేత్త యగు మనువు చెప్పినప్రకారం నాలుగువర్ణాలున్నాయి. (1) బ్రాహ్మ ణులు, (2) క్షత్రియులు, (3) వైశ్యులు, (4) శూద్రులు. బ్రాహ్మణులపని విద్యచెప్పుట, సమాజముయొక్క శాస్త్రాన్ని విజ్ఞానాన్ని అభివృద్ధిజేయుట, మతసంబంధమైన కర్మలను చేయించుట. బ్రాహ్మణులు అన్ని వర్ణములకన్న ఉత్తములు. బ్రాహ్మణులు మిగతా మూడు కులాలస్త్రీలను పెండ్లిచేసుకో వచ్చును. క్షత్రియులపని దేశములో శాంతిని కాపాడుట, బయటినుండి దాడులురాకుండా ఆపుట. వీరు బ్రాహ్మణుల కన్న తక్కువ. మిగతా రెండువర్ణాలకన్నా ఎక్కువ. వీరు బ్రాహ్మణస్త్రీని తప్ప మిగతా రెండువర్ణాల స్త్రీలను పెండ్లి చేసుకోవచ్చు. వైశ్యులపని వ్యవసాయము చేయించుట, వ్యాపారముచేయుట. వీరు బ్రాహ్మణ క్షత్రియ వర్ణములకన్నా తక్కువ. శూద్రవర్ణమునకన్నా ఎక్కువ. వీరు బ్రాహ్మణ



క్షత్రియ స్త్రీలను పెండ్లాడగూడదు. శూద్రస్త్రీలను పెండ్లాడ వచ్చును. శూద్రులు అన్నివర్ణాలకన్నా తక్కువ. పైమూడు వర్ణాల సేవజేయుటయే వీరిపని. వీరు పై మూడువర్ణాల సేవ జేస్తేనే మోక్షం పొందుతారట. వీరికి స్వంతఆస్తి లేదు. వీరు భూఖామందులైన వైశ్యులకు పొట్టకూటికి వ్యవసాయం జేసి పెట్టాలి.

వీరు పైమూడుకులాల స్త్రీలను పెండ్లాడగూడదు. సమాజమును మనువు మానవశరీరముతో పోల్చాడు. బ్రాహ్మ ణులు మెదడువంటివారు, క్షత్రియులు భుజములవంటివారు, వైశ్యులు ఊరువుల (తొడలు) వంటివారు, శూద్రులు పాద ములవంటివారు. పై నాలుగు అంగాలు శరీరానికి ఎంతఅవసరమో సమాజానికిగూడ ఈనాలుగు వర్ణాలు అంత అవసరము. పైనాలుగు అంగాలు లేకపోతే మానవుడు ఎలాజీవించలేడో నాలుగువర్ణాలు లేకపోతే మానవసమాజం నడవదట! వర్ణ ములు పుట్టుకతోనే రావట! వారి చేతలనుబట్టి వివిధ వర్ణా లలో జేరతారట! బ్రాహ్మణుడు యుద్ధముజేయడం నేర్చుకొంటే క్షత్రియుడే అవుతాడట. క్షత్రియుడు విద్య శాస్త్రాలు చదువు కుంటే, బ్రాహ్మణుడవుతాడట. కాని ఇది సిద్ధాంతరూపకంగా మాత్రమే మారిపోయింది. ఆచరణలో శూన్యం.

గృహకృత్యములు నెరవేర్చుటయే స్త్రీలధర్మము. భర్తలమాటకు జవదాటగూడదు. భర్తయే దైవమట! భర్తకు సేవ జేస్తే దేవుని పూజించకయే స్వర్గం వస్తుందట!

ఇండియాలో వర్ణభేదాలకాలము బానిససమాజమే. రోము గ్రీసు దేశములలోని బానిససమాజాలకు ఇండియాలోని బానిససమాజానికి భేదముంది. కాని మూలసూత్రము ఒక్కటే. రోము గ్రీసు బానిస సమాజములలో బానిస యజమానులలో భేదాలు లేవు. బానిస యజమానులు వర్తకముజేసినా యుద్ధము చేసినా శాస్త్రాన్ని నేర్చుకొన్నా ఒకటే. వారిలో వర్ణభేదాలు లేవు. అందరు పెండ్లిండ్లు చేసుకునేవారు. ఇండియాలో అట్లుగాక బానిసయజమానులలో వారు చేయుపనినిబట్టి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లను మూడుభాగములు ఏర్పడినవి. శూద్రులు బానిసలు. బానిసలుయజమానులు అను వర్గములు మానవ సమాజమునకు అవసరమని వేదాంతం రోములోవలెనే సమాజానికి నాలుగువర్ణాలు అవసరమని వేదాంతం ఇండియాలో కూడ బయలుదేరింది. రోము గ్రీసులలోవలె యిండియాలో కూడ స్త్రీలు స్వాతంత్ర్యాన్ని కోలుపోయారు. అక్కడ ఇంట్లో బంధించబడినట్లుగానే ఇక్కడకూడ బంధించబడినారు.

<u>పురాణాలకాలము, బానిససమాజకాలము</u> :—రామాయణము మహాభారతకథలు బానిససమాజము నాటివే. రామాయణకథ ఆర్యుల, ద్రావిడుల యుద్ధమే. ఆర్యులు రామునిపక్షం వారు. రాక్షసు లనబడేవారు ద్రావిడులు. రామాయణములో వ్రాసినంత కురూపులుగాను క్రూరులుగాను ద్రావిడులు లేరు. రామాయణము ఆర్యకవియైన వాల్మీకిచే వ్రాయబడుటచే ఆర్యులు పొగడబడినారు. ద్రావిడులు దూషించబడినారు. ద్రావిడులుకూడ మానవులే. రామాయణకథలో ద్రావిడులు



పూర్తిగా జయించబడినారు. భారత యుద్ధకాలమునాటికి ద్రావిడులు ఆర్యులు అను భేదము అంతరించింది. ద్రావిడులు ఆర్యులు కలిసిపోయినారు. ద్రావిడులుకూడ వర్ణభేదాలను స్వీకరించారు. ఇప్పటి అస్పృశ్యులు ఆర్యులపెత్తనమును ఒప్పుకొననివారు. వారిలో ఐక్యము అయిపోనివారు. వారు వెలివెట్టబడినారు. అందు వలననే మాల మాదిగలు ఆదిఆంధ్రు లని పిలువబడుచున్నారు.

<u>జమీందారీ సమాజము</u>:—బానిస సమాజములోనుండి జమీందారీసమాజములోనికి భారతదేశము ఎప్పుడు మారినదీ తెలియదు. వ్రాయబడినచరిత్ర ఆరంభ మయ్యేటప్పటి భారతదేశము జమీందారీసమాజదశలో నున్నది. భారతదేశములో జమీందారీసమాజదశ చాలాకాల మున్నది. ఇంగ్లీషువారు మన దేశములోనికి వచ్చేటప్పటివరకు మనదేశము జమీందారీ సమాజదశలోనే ఉన్నది. వారికి దేశపరిస్థితులు తెలియకపోవుటవలన శిస్తులవసూళ్ళకు జమీందార్లను ఉపయోగించవలసి వచ్చినది. అందువలన జమీందారీసమాజము బ్రిటిష్ హయాములో వృద్ధి పొందినది. ఇప్పటి జమీందారీ విధానము బ్రిటిష్‌వారిసృష్టియే. మనదేశములో పురాతనపు ఆచారాలను మూఢనమ్మకాలను కాపాడుచూ జమీందారీవిధానము స్వదేశసంస్థానాలు పోకుండా చేసి ప్రజలను మూఢులుగా ఉంచి ఇంక ఎక్కువకాలం తమ అధికారమును సాగించుటయే బ్రిటిష్ పెట్టుబడిదారీవర్గము యొక్క పాలసీ అయియున్నది.

**పెట్టుబడిదారీసమాజము:**—బ్రిటనులు రావటముతో మనదేశము పెట్టుబడిదారీ విధానములో అడుగుపెట్టినది. కొద్ది కొద్దిగా పరిశ్రమలు అభివృద్ధి జెందినవి. బ్రిటిష్ పెట్టుబడిదారీ వర్గము తమ పెట్టుబడిదారీవిధానమునకు భంగము కలుగకుండా మనదేశములో పరిశ్రమలు అట్టే అభివృద్ధికానివ్వటం లేదు. పెట్టుబడిదారీవిధానాభివృద్ధికి బ్రిటిష్ సామ్రాజ్యమే అడ్డుగా ఉన్నది. పూర్తిగా జమీందారీ సమాజమునుండి పెట్టుబడిదారీ సమాజములోనికి మారలేదు. సామ్రాజ్యవాదము పోతేనేకాని అట్టి మార్పు రాదు. సామ్రాజ్యవాదము ఉన్నంతకాలము జమీందారీ విధానము ఏదో ఒకరూపములో ఉంటుంది.



